# సతీతులసి

ఆఱంకముల నాటకము.

గ్రంథకర్త.

రామనారాయణకవులు

ప్రకటనకర్త.

రంగా వేంకటరత్నం.

బుక్ సెల్లరు,

బెజవాడ.



For Permission to Stage, apply to:—
THE PUBLISHER, BEZAVADA
1930

# గురుశిష్యసంవాదము



ఇది నాచే రచింపబడిన వేదాంత గ్రంథరాజము.

ఇందనేక వేదాంతవిషయములు గలవు.

సుప్రసిద్ధవిద్వాంసులచే మన్ననలందినది.

వె॥ రు 1—4—0

వలయువారు:—

వంగా వెంకటరత్నం గ్రంథకర్త & బుక్ సెల్లరు

బెజవాడ.

# సతీతులసి

తులసీమాధవము.


గ్రంథకర్త:

రామనారాయణకవులు,



ప్రకటనకర్త:

రంగా వెంకటరత్నం.

బుక్కుసెల్లరు, విజయవాడ.

5 వ కూర్పు 1000 ప్రతులు

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

1930





వె. రు. 1—0—0.

# ఈ నాటకమున వచ్చు పాత్రములు.



## పురుషులు

బ్రహ్మ— సృష్టికర్త.

విష్ణుమూర్తి— వైకుంఠనాథుడు.

పరమేశ్వరుడు— కైలాసపతి.

ఇంద్రుడు— అమరవిభుడు.

జలంధరుడు— పరమేశ్వరుని కోపజ్వాలనుండి జనించినవాడు, బృందకు పతి.

మణికుండలుడు— బృంద తండ్రి.

నారదుడు— దేవఋషి.

గాలవుడు— ముని.

## స్త్రీలు.

సతీదేవి— పరమేశ్వరుని భార్య.

లక్ష్మి— విష్ణుమూర్తి భార్య.

బృంద— జలంధరుని భార్య.

చారుమతి— గాలవుని భార్య.

# సతీతులసి.

## నాంది.

శా॥ బృందన్గౌరి విచారమందఁ దగునే ♦ విష్ణుండవైయుండి; యీ
చందంబున్ వినినన్ జనుల్ నగరె చా ♦ బ్జాలింకయుంచున్ మహా
నందంబొప్పఁగఁ బల్కుఁ గౌఁగిట రమా ♦ నారిన్ గృపంజేర్చు, గో
విందుం డేలునుగాత సత్కృపమెయిన్ ♦ వీక్షించుచున్ సభ్యులన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) పూజ్యులగు నో సభాస్తారులారా !

శా. శ్రీకల్యాణ గుణాకరుండ మరసం ♦ సేవ్యుండు నిత్యుండు, లీ
లాకారుం డఖిలాంతరంగుడమలుం ♦ డాద్యుండనంతుండు, సు
శ్లోకుండాశ్రిత భక్తరక్షణుఁడు, త్రై ♦ లోక్యప్రభుండైన, ల
క్ష్మీకాంతుండు నిరంతరంబును శుభ ♦ శ్రీలిచ్చి మిమ్మోముతన్.

(సభ్యులపైఁ బుష్పములఁజల్లి తనలో) అహా ! సకలకలావిశార
దులగు నీసభ్యులచే నేఁడొకనూతన నాటకము ప్రదర్శింపఁజేయుట
కాజ్ఞాపింపఁబడితిని. ఇయ్యది నాకుసంతోషమేగాని యీనాటకప్రద
ర్శనమున వీరిచిత్తము రంజిల్లఁజేయుదునా యనుసంశయము గలుగు
చున్నది. కానిమ్ము. (ప్రక్కంజూచి) మారిషా !

మారిషుఁడు—(ప్రవేశించి) బావా! ఏమి సెలవు ?

సూత్ర—ఇంకను నేమి సెలవయనియడుగుచుంటివా? కార్యభారమెంత
యోతలపైనుండ నీవిట్లు సోమరివైయుండిన నేనేమందును ?

మారి—బావా! నేనుచేయవలసిన కార్యమేమి ?

సూత్ర—మారిషా! లతాంతనితాంత సౌరభాక్రాంత దిగంతమును, నిరంతర దక్షిణవాత పూర్ణరోధోంతమును, కోకిల భృంగశుకారవ చాలితదాంత సంతతిస్వాంతము నగువసంతము ప్రవేశించినది. చూడుము.

చ. పరువతమన్నమూహము ప్రభాతపువేళకు నొయ్యనర్జనం
గరహి సుకేడ్డిశాతటుల గ్రాలునినోదయకాంతిపంక్తిపై
ఖరిబరిశీర్ణ జీర్ణదళ కాండముాలైన మహీజశాఖకో
త్కరముల బల్లవాంకురని కాయము రంజిలె మంజులాకృతిన్.

మారి—ఈవసంత కాలమెంతయు సౌఖ్యదాయకమైనది కదా!

సూత్ర—ఈవసంతరాత్రమున, నీసభ్యులకు నొక నూతననాటకప్రదర్శనమున సంతసము గూర్చదలంచితిని.

మారి—నాటకమేదో నిశ్చయించుకొంటివా?

సూత్ర—అందులకే నిన్నుబిలిచితిని.

మారి—బావా! ఇంటబిడ్డ నిడుకొని యూరంతయు వెదకినట్లున్నది. నీవు నాందియందు చక్కనికధనే సూచించితివి కదా!

సూత్ర—మారిషా! ఇక్కధను జక్కగజ్ఞప్తికి దెచ్చితివి. ఆకధ! "సతి తులసి" యనుపేర నాటకముగ నిటీవలనే యొకకవి రచించినాడు. అద్యాది యింతవఱకెవ్వరును బ్రదర్శించకపోవుటంజేసి, ప్రధమ ప్రదర్శనా గౌరవము మనము దక్కించుకొందము.

మారి—ఆర్యా! గ్రంథకర్త రచనా విశేషమునుబట్టి నాటకప్రదర్శకులకును, ప్రదర్శకుల నైపుణిని బట్టి గ్రంథకర్తకును పేరువచ్చును. అందుచే నీనాటకము రచించినవారెవరో తెలిసినగాని నేనేమియు జెప్పజాలను.

సూత్ర—నీవా విషయమున సందియమునందబనిలేదు.

చ॥ తిరుపతివేంకటేశ్వర సుధీశులగొల్చి నిరర్గళాద్భుతా
క్షరరసపుంజ మంజులవి కస్వరచాతురి కభాసుభానురం

ధరబహుళప్రబంధకవి । తారచనాచతురోక్తి సంపదన్
వరలు ప్రసిద్ధుఁడైన కవి । వర్యుఁడొకండు రచించె దీనిన్.

మారి—పేరు రహస్యమైనదా యేమి ?

సూత్రి—అతఁడు మనకుఁ బరిచితుండే

సీ. మొగమైనఁ జూపకే । భూరివెంకటగిరి,
క్ష్మాపాలు సత్కృతిఁ । గాంచినాఁడు
తిరువూరు నృపతికి । దివ్యకవితఁ జూపి,
బంగారు బిరుదంబు । బడసినాఁడు
అంకినీడుక్ష్మాపతి । యాదరింపఁగ నెంత,
యైన విమలయశం । బందినాఁడు
సత్యవోల్వంశాబ్ధి । చంద్రులు తగిన స,
త్కవివంచు మన్నింప । దనరినాఁడు

తే. గీ. కోటగిరివంశ వారాశి । కువలయాప్తు
చేత బంగారు బిరుదంబు । జెందినాఁడు
వినగలేదె ద్రోణమురాజ । విమలవంశ
వార్ధి శశిని సీతారామ । వరసుకవిని.

మారి—అవునవును జ్ఞప్తికి వచ్చినది. అనేక దృశ్యకావ్యముల కీతఁడు కర్తయగుటయేగాక, ఈతని విరచితములగు కొన్నివచన గ్రంథములు పాఠశాలలయం దుంచుటకుగూడ దొరతనమువారిచే నామోదింపఁబడినవి.

సూత్రి—నీకుఁ దెలియని దేమున్నది ? (సభికులఁజూచి) పూజ్యులగు నోసభాస్తారులారా ! గ్రంథకర్త తమతో నిట్లు విన్నవింపుమని నాకాజ్ఞాపించినాఁడు.

సీ. సాంధ్ర భాషావిశే । మరహస్య నిక్షేప,
కుక్షియై యలరెడు । కోమలాంగి
వేళ్ళజూపఁబడ కొ । ప్పిన యరుంధతిరీతి
వర్తించుచుండిన । వారిజాక్షి

శ్రీతినాథ చంద్రు ♦ స్తుతిఁ గాంచి యశముతో,
వర్ధిల్లు చుండిన ♦ పద్మగంధి
గర్వ మంతయును లేక ♦ కవుల కెల్ల విధేయు,
తను జూపి చెలఁగెడి ♦ తలిరుఁబోఁడి

తే. గీ. మామక కవిత్వ కన్యక ♦ మహిని మీకు
నూతనము గాదు; గావున ♦ భీతి విడచి
యీ "సతీతులసి" ని మీకు ♦ నిడితి గొని
నాదరింపుఁడు ప్రీతిమై ♦ నార్యులార.

(తెరచాటు నుండి) నావిన్నపము గూడ నాలకింపవలయును.

సీ. సాధ్వీగుణాబ్ధి యై ♦ సాహసంబున జలం,
ధరుని జూపెడి నిరా ♦ దరణ విధము
గర్వించి యడఁడనక ♦ కాంతల బల్మిమై,
గూడఁగా నెంచిన ♦ క్రొంజెలుతనము
ఎంతచేసినఁ గాని ♦ యింతి నా నిని సతి,
శాంతితో గొల్చెడి ♦ సరళతయును
లోకరక్షకుఁ డయ్యు ♦ లోలాక్షి బృందను,
విష్ణుండు మోహించి ♦ వెలయుసీతి

తే. గీ. పతి గతి యింపఁగా నా బృంద ♦ ప్రాణములను
బాసి, తులసియైన విధంబు ♦ బరగ మీర
లిందు వీక్షించి యానంద ♦ మందగలరు
ధన్యగుణులార యీ సభా ♦ స్తారులార.

(నారదుని జూచి) మారిషా! ఇంక మన మాలస్యము సేయక పాత్రలను సిద్ధము జేయుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

———



# సతీతులసి.

## ప్రథమాంకము.



రంగము:—(1) [పర్వతగుహా ద్వారమున ప్రవేశము:— పరమేశ్వరుడు]

పర—(తనలో) మూడు మూర్తులకును మూలకారణమైన యీ యాదిశక్తి యెప్పటికి కనుమూలించునో! అని తన తపమున కెవ్వరైన భంగము గలిగించెదరేమో యని సన్ని యొద్ద నతి జాగరూకతతో నుండ మని చెప్పితిని. ఇంతవరకును నామె లేవలేదు. మింట ప్రభాకరుండు తన ప్రచండకిరణములతో ప్రకాశించుచున్నాడు. అబ్బా! వేడి యధికముగ నున్నది. (అటు నిటు చూచి)

చ॥ మిహిరుని వేడిమిని మిగుల ♦ మింటను జరింప నశక్యమై తనూ
రుహములు పిచ్చనోడి కడు ♦ రోజుచు బల్విడ నొందుచున్ మహీ
రుహములు నుదితాస్థతో గగ ♦ మున్ వెస నంటిన వానిం బిల్చుచున్
విహగకులంబులెల్లం గరు ♦ వీథుల మీదికిం జేర రాయ్యనన్,

(ఇంద్రుడు - ప్రవేశించును.)

ఇంద్రు—(తనలో) సృష్టిస్థితిలయంబులకు గారణంబైన యాదిశక్తిని నొకసారి దర్శించి కృతార్థుడ నగుదునుగాక- (ఎదుటజూచి) కైలాసపతి యగు పరమేశ్వరుడు గూడ నిచ్చటనే యున్నవాడు. ఈతని దర్శనముగూడ నాకిచ్చట లభించుట నా భాగ్యవిశేషమే.

(పరమేశ్వరుని సమీపించి)

క॥ పరమపావనియంచు ♦ బిరుదంబు గాంచిన
గంగాఘునము మస్త ♦ కమున నమర

నలికభాగమునందు • నలఘు కుంకుమబొట్టు
గలిగియున్న మూడవ • కన్ను మెఱయ
వజ్రపంజరనిభ • వక్షస్థలంబున
రమణీయ సర్పహా • రంబు లలర
పగడపుఁ గాంతికి • వన్నెఁబెట్టఁగజాలు
నరుణజటాసము • త్కరము దనర

తే. గీ. పాణిపోషిత హరిణశా • బకము వెలుఁగ
గన్నులకు బంధువై యఖిలమం • గళమునకును
నాస్పదంబైన నీమూర్తి • నార్తిదీరఁ
గాంచినాఁడను ధన్యతఁ • గాంచినాఁడ.

(పరమేశ్వరుని సమీపించి) రజతాద్రినిలయా! శంకరా! వందనములు •

పర—ఓహో! ఇంద్రుఁడా యేమి !

తే. గీ. సుఖమె నీభార్యపౌలోమి • కుశలమె మీ జ
యంతపుత్రుండు భద్రమే • యమరతతికి
నీకు నిరతంబు మోదమే • నాకలోక
సార్వభౌమ! వచింపుమా •. సంతసింతు.

ఇంద్రు—దేవా! నీకరుణచే మేము సుఖముగనే యుంటిమి.

పర—మహేంద్రా !

తే. గీ. అదె నభోమండలంబున • నయ్యినుండు
చండకిరణుఁడైయుండె, నీ • సమయమందు
నడకుఁబోవుచు నిన్నెడ • కేఁగుదెంచి
నావు, వినఁదలంతును గార • ణము బలారి

ఇంద్రు—మహేశ్వరా ! నాకితర కార్య మేమియును లేదు. నేనిక్క డకే యరుదెంచితిన.

పర—కారణము.

ఇంద్రు—అటులైన దర్శించుటకు

పర—అహ్హాహ్హా (నవ్వుచున్నాఁడు)

ఇంద్రు—శంకరా! అట్లు నవ్వితి వేమి?

పర—మఱేమియును లేదు. ఆజగజ్జనని యోగసమాధియందున్నది.

ఇంద్రు—తపమునుండి లేచిన పిదపనే దర్శించెదఁగాక!

పర—ఆమె తపమునుండి యెప్పటికి లేచునో తెలియదు అయినను నామె యిప్పు డెవ్వరికిని దర్శనమీయదు కావున నీవాయాశ యిప్పటికి విడిచి మఱికొకసమయమున రమ్ము.

ఇంద్రు—పరమేశ్వరా! నీవట్లు చెప్పిన నేమందును? దయయుంచి నారాక నమ్మహాదేవి కెఱింగింపుము.

పర—ఆమె నీవిప్పుడెంత శ్రమపడినను దర్శనమొసంగదు.

ఇంద్రు—ఏమిటి! ఆమె నాకు దర్శనమొసంగదా!

చ॥ అమర విభుండనై విబుధు ♦ లందఱు గొల్చుచునుండ నాకలో
కము రహిఁ నేలు నన్నిపుడు ♦ గాంచకయుండునె యాదిశక్తి తా
నమిత కృపారసంబున న ♦ యారె! యిటులే వచియింప నీకు న్యా
యమె కృప,దాల్చి చెప్పుము ము ♦ దాగమనంబును నామెకీశ్వరా

పర—నీభాగ్యమునుబట్టి యామె నీకు దర్శనమొసఁగునని తలంచుచుంటివా యేమి! గర్వాంధకారమున మునిగియున్న నిన్నుఁ జూడనేమాడదు.

మ. అలఘు ప్రజ్ఞను యోగిమార్గముల న ♦ భ్యస్తించు యోగీశ్వరా
వళికైనన్ నిరతంబు దృశ్యయగుచున్ ♦ భాసిల్లు నద్దేవిఁ గ
న్నుల వీక్షింపఁగఁ జాల వీవిపుడు ని ♦ న్నున్ లక్ష్మి గర్వాబ్ధిలో
పలఁ గ్రుంగంగఁ బొనర్చియుండుటను దే ♦ వ ధవా వేయేటికిన్.

సంపదాంధులకు నామె వీక్షింపదు

ఇంద్రు—ఉమాకళత్రా! నీవాక్యములు చిత్రముగనున్నవి. నీవు కేవల మనూయాపరుఁడవై యిట్లు వచించుచుంటివిగాని మఱియొండు కాదు. సమస్త సౌఖ్యములకును మూలము సంపదయేకదా! సంపద లేనివాని బ్రదుకు నిరర్థకము.

పర—ఆసంపదయే మానవుని గ్రుంగఁజేయునది నీవరమరలోక విభుండ వనుమాటయేగాని నీబ్రదుకునకుఁ బ్రతిదినమును గండమే.

తే. గీ. ఎప్పుడే క్రూరదానవుం • డెత్తివచ్చి
రణముఖంబున గెల్చి నా • మ్రాజ్యలక్ష్మి
నపహరించునో యనుచు నీ • వాత్మయందు
జింతతోడనుండెదవు శ • చీకళత్ర

నాకట్టిచింత యేమియు లేదుకదా

ఇంద్రు—నిజమే.

సీ. వసియింప సౌధఁబు • వరలకుండుట చేతి
వెలయు చుండుదువు నీవు • వెడ్కఁ గొండ
కడుపు కూటికి లేని • కతమునఁదిఁదు వా
హ్యాదమెసంగ హా • లాహలంబు
భరియింప హారముఁ • దొరకకుండుట చేత
గళమునఁదాల్తువు • గ్రఫణిసగాని
దారిద్ర్యబాధచే • ధనమున కాసించి
చేరినాడవలకు • బేరుమైత్రి

తే. గీ. యిట్టివాడవు నీవు స • న్నెల పరిహ
సింప వలదు నీస్థితినాకు • స్వప్నమునకు
దుఃఖమైనను లేక సం • తోషమైన
ధనములేనట్టి బ్రదుకు వ్య • ర్థముగాదె.

సీ. భిక్షపాత్రయు • వెలయుకుండుట చేత
బట్టినాడవు చేత • బ్రహ్మశిరము,

గప్పకొంటకు శాటి ♦ గానక దాల్చినా
వింపని భావించి ♦ యేన్గుతోలు
విహరింప వని లేక ♦ విహరించుచుందువు
బహుభయంకరమైన ♦ వల్లకాట
వాహనంబులు లేక ♦ బహుమోదమనియెంచి
యెక్కుచుంటివిగాదె ♦ వృషభమూర్తి.

తే. గీ. యిట్టిదేకద నీస్థితి ♦ యెవ్వరెరుగ
రేల నాపయిననసూయ వ ♦ హించి పలికె
దిట్లు పరశక్తి దర్శింప ♦ నెంచునాకు
కొద్దిగొప్పలతో నేమి ♦ కుధరవాస.

పర — ఓహో! మహేంద్రా! నా స్థితిని నీవు వెక్కిరించుచుంటివిగా! నీకెంత భాగ్యమున్నను నాకుఁదుల్యుడవు కావు. వెఱ్ఱివాడవై నీవు నన్ను బరిహసించుచుంటివి. నీవాదిశక్తిని దర్శింపవచ్చితివి. ఇది సమయముగాదని చెప్పితిని. దానికీ యనవసర ప్రసంగమేల తొందరపడినచో గార్యమగునా?

తే. గీ. ఎద్ది యెప్పుడు గాదగు ♦ నద్ది యప్పు
డగును నీవెంత చేసిన ♦ నగునె చెప్పుము
కొట్టిలేపిన యాకోడి ♦ కూసినంత
నర్ధనిశిఁ బ్రొద్దుపొడుచునే ♦ యమరనాథ.

ఇంక శ్రమజెందక యిప్పటికి మరలిపోయి మఱియొక సమయమున రమ్ము.

ఇంద్రు — ఇట్లు జెప్పుటకు నీచిత్త మెట్లు సమ్మతించినది. ఆ పరంజ్యోతి నీయట్టి వారిని ద్వారరక్షణోద్యోగమున నియమించుటం జేసి యిట్టిదనుభవించుచున్నది.

తే. గీ. అల్పుడవు నీకు నధికార ♦ మబ్బుకతన
నిట్లు సాహసంబునఁ జేయ ♦ నెంచినావు

వేనునకుబెత్త నంబీయ • వెట్టియగుచు
శిరముసంతయు గోరికిన • కరణి నభవ

పర—మహేంద్రా! మితిమీరి మదీయ మహిమం బెఱుంగక నంభాషింపకుము. వినాశకాలమునకు విపరీతపు బుద్ధులు పుట్టు నన్నట్లు నీకు జేటుకాల మాసన్నమగుటచే నన్ను దూషించుచుంటివి. బ్రతుకదలంచిన వాడవేని వచ్చినమార్గమును బట్టి పొమ్ము. ఆదిశక్తి విదర్శించుటకిది సమయము కాదు.

ఇంద్రు—పోనిమ్ము. భగవతి సందర్శనము జేసికొనదలంచిన నాకు నీయాజ్ఞతో నేమిపనియున్నది! నేనే లోనికేగి యద్దేవి తపమునుండి లేచువరకును వేచియుండెదగాక (లోపలికి పోబోవును)

పర—(వారించి) ఔరా నీగర్వము

శా. ఏమేమీ కనుగాన కీకరణి, నీ • వేయాదిశక్తిం గనం
గా మోదంబున బోవఁజూచెదవె య • య్యమ్మన్ జూడ నొక్కింత, నా
సామర్థ్యంబు దలంప వేటికి, వినా • శంబున్ మదింగోరి యా
భీమోద్యత్త్రిశయాగ్నిమీద శలభం • బేదూక నుంకించునే

ఇందులకుఁ దగిన ఫలమనుభవించెదవుగాక! ఇదిగో! మదీయ సన్నిరోధ క్రోధదారుణ వీక్షణంబులనక్షీణకూటాకాశు శుక్షణిస్ఫులింగ నికరంబుల గెలిపి నిన్ను దగ్ధము శేసెదఁగాక! (కోపముతోఁ జూచినంతనే యచ్చట యగ్నిజ్వాలలు వెడలును.)

ఇంద్రు—(వడకుచు) హా! పరమేశ్వరా! అపరాధిని రక్షింపుము రక్షింపుము-(పరమేశ్వరుని పాదములపైబడి)

మ. సరసీజాతభవాది లేఖవరుల • శ్రాంతంబు సేవింప బె
ల్లిరవై మించు మహానుభావుడవు నీ • విభ్రాంగినాయందు, దు
ర్భరకోపంబునుబూని చూచిన నికన్ • బ్రాణంబులున్ నిల్చునే
పరిరక్షింపవె నీకు మ్రొక్కెదను దేవా! శైలజావల్లభా!

శా. శ్రీవిష్ణుస్తుతిపాక పద్మదవుసై | చెల్వొందుచుం జిక్కులం
గావం గంకణమున్ ధరించి, సతితోఁ | గైలాసమందుండు, నా
దేవేశుం నిను నే నెఱింగియు మదాం | ధీభూతచిత్తుండనై
యేవో మాటల నాడినాఁడ నిఁకఁ దం | డ్రీ! నన్ను రక్షింపవే!

పర—(చేతులతో నింద్రుని లేవనెత్తుచు) మహేంద్రా! భయమువిడిచి లెమ్ము. నీకభయమిచ్చితిని.

ఇంద్రు—(కరములు మోడ్చి)

మ. అపరాధంబని యైన నెంచక మదీ | యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ నిన్నుఁ బల్కితి భవ | ద్విఖ్యాతకారుణ్యదృ
ష్టిపథంబందున నన్ను నిల్పుచును ర | క్షింపందగుం వేగ, నే
నపవిత్రుండఁ బవిత్రుఁ జేయుము మహా | త్మా! భక్తరక్షామణీ.

దేవా! భవదీయ దివ్యమహిమ నెఱింగియుండియు, మూఢుండనై యజ్ఞానంబునఁబడి నీయెడల నపరాధంబు గావించితిని, భవదీయ వీక్షణంబులనుండి వెలువడిన యగ్నిజ్వాలలింకను బ్రజ్వరిల్లుచునే యున్నవి. నాభయముబాపి రక్షింపుము.

పర— తే. గీ. చింతపడఁబోకు దీనికి | స్వాంతమందు
జ్ఞానులకె యిట్టి దోకృష్టు | సంభవించు
నీవు ధన్యుడవైతివి | నేఁడు నాదు
కరుణఁగాంచి నాడవు గాన | సురకులేంద్ర.

(అగ్నిజ్వాలలకై చూచి) నా నేత్రమునుండి వెలువడిన యీ యగ్నిజ్వాలలు నిరర్థకమై పోరాదు. కావున నేను వీనిని సముద్రమునఁ బడునట్లు చేసెద. ఈ జ్వాల యొకని జన్మమునకుఁ గారణమగుఁ గాక.

(అగ్నిజ్వాలలను చేతిలోఁబట్టి విసరివేసి)

మహేంద్రా! ఇంక నీవరుగుము.

ఇంద్రుడు—(నమస్కరించి) దేవా! సెలవుగైకొనెద. (నిష్క్రమించును)

పర—ఆదిశక్తి తపమునుండి లేచినదేమో చూచెదంగాక.

(నిష్క్రమించును.)

రంగము:—(2) [సముద్రముపై నొక శిశువు తేలియాడుచుండును. సాగరుండు - ప్రవేశించును.]

సాగ—(శిశువుంజూచి) ఓహో! ఈబాలుం డెవ్వరోకదా! ఎవ్వరో దేవాంశసంభూతుండై యుండును. కానిచో, జలంబున మునుగక తేలుట యెట్లు సంభవించును. సాధారణముగ భూమిపై బ్రాకిన విధముననే యీతండు జలముపైం బ్రాకుచున్నాండు. (ఇంచుక యూరకుండి) నేనీ శిశువు దీసెదగాక. (శిశువును దీసి యెత్తుకొని)

మ॥ పరమాశ్చర్యము వీని నెమ్మొగము మహా ♦ పర్వేందు బింబంబునే
పరిహాసంబొనరించుం దేజముగనన్ ♦ బద్మాప్తునిన్ మించు నె
వ్వనిసూనుండొ గదా తలంపంగను నీ ♦ భంగిన్ ననుం జేరె; స
త్కరుణన్ వీనిని నెత్తి పెంచెదను వే ♦ డ్క దేవతల్ మెచ్చగన్.

ఈబాలుం డొక యపూర్వతేజశ్శాలి. భవదంశ సంభూతుండు గాని సామాన్యుడు గాండు.

[(బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులును, ఇంద్రుడు, ప్రవేశింతురు]

పర—(ఇంద్రునిజూచి) ఇంద్రా! కంటివా! ఆజ్వాల బాలుండుగా బరిణమించి, సాగరుని హస్తమున నలంకరింపం బడినాడు.

బ్రహ్మ—అభవా! ఆబాలుని యపూర్వ తేజమిక్కడకే ప్రకాశించుచున్నది.

విష్ణు—మనమూ సాగరుని సమీపించి బాలునిం జూతము.

[అందఱును సాగరుని సమీపింతురు]

సాగ—(తనలో) త్రిమూర్తులు నన్నుం గృతార్థునిం జేయుటకుం గాబో లిట్లు వచ్చుచున్నారు (బ్రహ్మాదుల కదురేగి ముందు విష్ణుమూర్తి నింగాంచి)

సీ. నీలనీరదగాత్ర • నిర్జరవనచైత్ర,
శంకరస్తుతిపాత్ర • సచ్చరిత్ర
వైజయంతీదామ • వర్ణితసుత్రామ,
కల్యాణనామలో • కాభిరామ
భక్తసంరక్షక • పావనజలజాక్ష,
శ్రీయుతవక్ష • శిక్షితపక్ష
సర్వలోకాధార • సంశ్రితమందార
నిగమాంతసంచార • నిర్వికార

తే. గీ. నన్ను ధన్యునింజేయుమ • నంబు నందు
గాంచి వీరితో గూడ నే • తెంచినావు
పావనంబయ్యె నాజన్మ • పరమపురుష.
యోగిహృద్ధ్యేయ జగదేక • భాగధేయ.

(పరమేశ్వరునిం జేరి.)

మ. కరుణామూర్తిని భూతనాయకుని స • త్కైలాసవాసున్ సగా
సురసంసేవితపాదపద్మయుగళున్ । శుద్ధాత్ము శైలాత్మజా
వరునిన్ బాపవిదూరు, భక్తసులభున్ । భావోద్భవారిన్ నినున్
బరమామోదముతోడం జూచితిటనా । భాగ్యంబు సామాన్యమే.

(బ్రహ్మనుజూచి) భారతీరమణా! వేల్పులం బెద్దవగు నీవుగూడ నిచ్చోడ కరుదెంచుటంజేసి నేను గృతార్థుండ నైతిని. (ఇంద్రుని గాంచి) అమరేంద్రా! నీరాక నాకెంతయు మోదావహమయ్యె,
[అందఱినిం జూచి,]

ఉ. ఓమహనీయులార, విబు • ధోత్తములార! త్వదాత్మలందరు, న
ప్రేమను బూని నాపయిన • వేడ్కలరారంగ వచ్చినారు నే

నేనిపు డేమొనర్పగావలెను ♦ నెయ్యదికార్యము యానతిచ్చినన్
మీమదికిన్ ముదంబుగను ♦ మేలు ఘటింతును భక్తిమీఱఁగన్

బ్రహ్మ—(తనలో) మహేశ్వరుని కోపానలజ్వాలయే శిశువై యొప్పెనని యీసాగరశకుఁ దెలియదు. (ప్రకాశముగా) రత్నాకరుండవగు నీకు మాయందింత ప్రేమయుండ, మాకేమి కొఱత ? (బాలుని జూచుచు) సాగరా : తన యపూర్వ తేజంబుచే దిశలను వెలిగించు చున్న యీ బాలుఁడెవ్వరో యెఱుంగవచ్చునా?

సాగ—దేవా ! నాకును దెలియదు. ఇట్టి సుందర రూపుని నేను మున్నెచ్చటను జూచి యుండలేదు. ఇంతకుమున్నె నే నీశిశువుం గాంచి మదీయపూర్వపుణ్యమున నీసూనుని లభించెగదాయని పరమామోదము నందుచుంటిని.

విష్ణు—శంకరుని కోపానలజ్వాలయే యీబాలునిగా మారెను. ఆహా! ఏమి! ఈకుమారుని సౌందర్యము నయనపర్వముగనున్నది సాగరా కుమారుని నొకసారి యిటు దెమ్ము. ముద్దాడ కోర్కెయయ్యె.

సాగ—(విష్ణుమూర్తి చేతికిఁ గుమారునిచ్చును.)

(విష్ణుమూర్తి కుమారుని నెత్తుకొనినంతనే యాకుమారుఁడు రాక్షసరూపము ధరించి విష్ణుమూర్తిమీఁద కేగును.

విష్ణు—ఆ! ఏమి! ఈమాయ నిఖిలదైత్యసంహారుండనగు నాయొద్దనా యీమాయ. ఇదిగో! చక్రముచే నిప్పుడే మృతిం జెందగాక [చక్రము వదలనెంచును.)

బ్రహ్మ—(వారించి) కమలనాభ ! నీచిత్తము నాయుద్యమమునుండి మఱల్పుము. ఈతఁడు వధార్హుండుగాఁడు. (రహస్యముగా) రుద్రుని రౌద్రజ్వాలవలన జనించిన యీతనిని నీవు మడియించితివేని యమ్మహాత్ముని మనంబు, విన్నబోవును. (పరమేశ్వరునిఁ జూచి) పరమేశ్వరా! ఈతఁడు భవత్క్రోధానలజ్వాలవలన బ్రాదుర్భవించి

జలముచే ధరింపఁబడెనుగాన, జలంధర నామధేయంబున భాసిల్లును (జలంధరుని జూచి) జలంధరా! సంగ్రామమున నీ వెవ్వారి నయిన జయింపఁగల శక్తిఁ బ్రసాదించితిని. మాకరుణచే నీకఖిల భాగ్యంబు లొదవును. విశ్వకర్మ మా యానతిని నీకై యీ ప్రాంతమున నొక పురము నిర్మించును. నీ వందుండుము.

వర—జలంధరా!

సీ. ధర్మంబె యాత ॥ పత్రము గాఁగ, నఖిల బు
      ధానురాగంబె సిం ॥ హాసనము గ
   మునివరాశీస్సువిం ॥ జామరంబుగ న్యాయ
      వృత్తియె కరమున ॥ గత్తిగాఁగ
   నఖిలదిక్కుల బ్రాకు ॥ యశమె చేలముగాఁగ
      ధర్మసంధత జయ ॥ ధ్వజముగాఁగ
   రారాజుల జోహార్లు ॥ నీ రాజనముగాఁగ
      తేజమే ఘనమైన ॥ దివ్వెగాఁగ
తే. గీ. లక్ష్మీసతియుంట నెప్పుడు ॥ లలి వసింప
      నజుఁడు ప్రేమను నీకు బూ ॥ ర్ణాయువీయ
      శ్రీసతీరమణుండు ర ॥ క్షించి మించ
      ధరణిఁ బాలింపు మాచంద్ర ॥ తారకముగ.

జల—దేవా కృతార్థుఁడనైతిని.

వర—(బ్రహ్మను జూచి) భారతీరమణా! జలంధరునికై పురము నిర్మిం చుటకు విశ్వకర్మను త్వరగా నియమింపవలయును. (తక్కిన వారిజూచి) మహేంద్రా! శ్రీహరీ! ఇంక మన నెలవులకుఁ బోవుదము. (సాగరుని జూచి) సాగరా! ఇఁక మేము పోయివచ్చెదము.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.




## ద్వితీయాంకము.



రంగము:—(1) [తొందరగా జలంధరుఁడు ముందును. వెనుక నారదుఁడును. బ్రవేశింతురు.]

జలం—

ఉ॥ ఇష్టములేని పెండ్లి యది • యేటికినాకును, నామె కెంతయో
కష్టము దోఁచియుండుటను • గాదె తదీయమనంబు నిప్పుడున్
స్పష్టము సేయ నీగతి నొ • నర్చెను, దీని కతాన నాకు నే
నష్టముఁ గల్గునో యికను • నాపురి కేఁగెద సత్వరంబుగన్.

ఏమైననేమి! నేనామెను స్వీకరింప నప్పుడీ భయమేల? నా దారిని నేను బోయెద. (తొందరగా నడచుచున్నాఁడు.)

నార—ఆ! ఆ! జలంధరా! నిలువుము నిలువుము. (జలంధరుని సమీపించును)

జలం—మునీంద్రా! నన్నాపవలదు.

నార—సమస్తమును తెలిసిన నీవిట్లుఁ జేసిన నే నేమనఁగలను?

మ॥ గళమందున్ వరపుష్ప దామమిడఁగా • గాంక్షించి యున్నంతనే
పడియెన్ గ్రిందికి జారి యందులకు భా • వంబందు నిబ్బంగి నీ
పలుకన్ జూసి వివాహమొల్లననుచున్ • బల్కంగ భావ్యంబె యా
పలుకుల్ విన్నను నవ్వఁ జైన నిను నే • [illegible] శ్లాఘింతు,నే.

ఎట్టివారికైనను నొకసమయమున పొరబాటు గలుగుచుండును. బృంద యుద్దేశపూర్వకముగాఁ బూలహారము నేలఁ బడవైచినదని నీవుతలచుట యెంతయు దోషము. అట్టియుద్దేశమున్నచో నీగళంబునఁ బూలహారము చేసలంకరించుట కామె యేల తలంచును!

జలం—మునీంద్రా! నీవేల యీబాలికి నాచిత్తమును మఱలింపఁ జూచెదవు?

తే. గీ. శుభసమయ మిది యంచు నా ♦ సుదతి కెఱుక
లేక యున్నదె, యెఱిగియు ♦ లేమ యిట్లొ
నర్చుటది నాకు నిష్ఠ డమం ♦ గళముగాఁగ
నోచకుండునె యిందునా ♦ దోస మేమి?

చేత దాల్చియున్న పూలమాల జాఱి క్రిందఁబడుట కది సూదియా దారమా! అయినను నిప్పుడా తర్జనభర్జనలేల? ఇట్టి యమంగళ కార్యము జరుగుటం జేసి యీబృందను గ్రహించుటకు నాచిత్తము సమ్మతింపదు. ఇంక నాకనుజ్ఞనిమ్ము. నాపురమునకు మరలి పోయెదను.

నార—జలంధరా! ఏపనిఁ జేసినను జగము మెచ్చునట్లుండవలయును.

ఉ. గారము నీపయింగలిపి ♦ కొమ్మతలనాథుల నెల్లరకు దిర
స్కారమొనర్చి నిన్ను విభు ♦ గా వరియింపఁగ గోరినట్టి యా
సారసనేత్రి కీగతి వి ♦ చారము గూర్చుట ధర్మమా నె! నీ
వారయ వేల దీనిఁ బరి ♦ యాచకమా యిటు నేయు భూవరా.

ఆ బృందకు నీయందుఁ జిత్తముంచుట చేతనేకదా స్వయంవరా ర్థమైవచ్చిన రాజుల నందఱను నొల్లక, నీగళంబుననే పుష్పదామము వేయనెంచెను! అట్టిచో చేజాతి యీ పూలదండ క్రిందపడి నంతమాత్రమున నీగతిని నాస్వయంవర సభను మడిచివత్తువా? నీయలుక మఱికొండలున కెంత విచారమునో కలుగఁజేసెను గదా! బృంద పరితాపము చెప్పఁ దరముగాదు.

మ. జలజాతాక్షిని బద్మగంధి నవలన్ ♦ శాతోదరిన్ సుందరిన్
విలసత్పూర్ణ శశాంక బింబవదనన్ ♦ విద్యుత్ప్రవాళాధరిన్
గలకంఠిన్ భవదీయ దాస్యకలనా ♦ కామన్ జగన్మోహినిన్
గలికిన్ బృందను వేగ్రహించి సుయశః ♦ కళ్యాణిఁ జేపట్టుమా.

జలం — తాపసోత్తమా! నీవెంత చెప్పినను నాచిత్తమా బృందను గ్రహించుట కావంతయు సమ్మతించుటలేదు. ఇష్టములేని పెండ్లి వలన నెట్టిదోసగు కలుగునో కదా! నాయందుఁ గరుణించి ఈ విషయమున నన్ను బలవంత పెట్టవలదు.

నార — ఓయీ! వెఱ్ఱివాడా!

తే. గీ. శకునములు స్వప్నములు గ్రహ ♦ చారములును
వినుము నీవంటివారికిఁ ♦ భీతిఁ గొల్పఁ,
జాలవు, పిఱికివారల ♦ స్వాంతములనె
కలఁచుచుండును నియ్యది ♦ తెలియవయ్య.

దీనివలన నీకావంతయు నశుభము గలుగదు. విశేషించి దీని వలన నీకు యశము గలుగుననియే నేను నొక్కి వక్కాణింపఁ గలను.

జలం — తాపసపుంగవా! నాగళంబున నలంకరింపఁబడదగిన పుష్పహారము బృంద చేతినుండి జాఱుటం జేసి, ముందేదియో కీడు నాకు ఘటిల్లునని చిత్తమున బెంగనాటికొనినది. అట్టిచో దీని నిప్పుడు సరకుసేయ ముందు శుభంబె యొదవునని నీవు చెప్పెడు మాటలకు నాచిత్తమున నెట్లు ధైర్యము నిలుచును; ముందు వచ్చు శుభమేమో తెలియదుగాని, యిప్పుడు జరిగిన కార్యమును బట్టి మాత్రము కీడొదవునని తోచుచున్నది. ఇటువినుము.

తే. గీ. కానరాఁబట్టి శుభమొందు ♦ గలుగుననుచు
కనులకును దోచు కీడు ♦ దొలఁగఁగలదె

కాతగట్టిన మేల్బావి । తప్పదనుచు
నుప్పునీరును దాగ్రెడి । ముప్పిగలండె.

నార—జలంధరా! ఇవి యన్నియు నవనవరమ్యమైన యుత్తరప్రత్యుత్తర
ములు. బ్రహ్మమానస పుత్రుండనైన నావచనంబులవిశ్వసింపుము
అనుమానమే నిన్ను బాధించుచున్నదిగాని మఱియొకటి కాదు
నీవిప్పుడిట్టి యకార్య మొనరించితివేని లోకమునందు గలయొత్తి
మొంగఁ జాలదు. ఇదియుంగాక విరించి కరుణా సమాసాదితమహా
పరాక్రమవంతుండవైన నీకేమిభయము! ఇంక బ్రతివచనము జెప్ప
కవచ్చి బృందంగానుము ఎదుటఁజూచి) అదిగో! చూడుము

సీ॥ వలయితపరివార । జలదాంతరంబునఁ
దీపించుకౌముద్రమ్మించు । దీవయనఁగ
నబ్ధిమధన సమ । యంబునఁ బ్రాదుర్భ
వంబునఁదిన రమా । ప్రాస్యయనగ
సఖుల భూవరహ్యాస్య । దార్ఢ్యంబు విధిసృజి
యించి పంపించు మో । హినియనంగ
నిజనాథు డాయ వ్రా । స్నికరజంబునవెంచి
కౌతుకంబుతోవచ్చు । రతియనంగ

తే. గీ. వలస్వయంవర రంగంబు । నందు విపుల
దిండతోనిల్చి యున్నది । తన్వి బృంద
కాన నామె మదికి హర్ష । మలరునల్లు
శంక విడనాడి రమ్మిఁక । తన్మతిలేందని

మ. శరదాఖ్యాబ్జ దళాభ భూరివిమల । చ్ఛాయాకలాపంబుచే
నరవిందారి నలంకరించు గతిఁదా । నాత్మీయహస్తాగ్రభా
స్వరి ఫుల్లాబ్జలతాంత దామకముచే । సైసేసి యాబృంద సు
స్థిరభక్తిన్ నిను బూజసేయగను వే । చెందరమ్మా భూపాలకా.

ఇంక మనంబున మఱియొక విధమైనశంకఁ బెట్టుకొనకరమ్ము.
(చేయి బట్టుకొని తీసికొనిపోవును.)

రంగము:—2. [మందిరమున—మణికంఠుఁడు—బృంద—జలంధరుఁడు]

మణి—(జలంధరునిఁ జూచి) జలంధరా! స్వయంవరమందిరమున నా! తనూజవలన జరిగిన యపరాధమును మఱచిపొమ్ము. (ఇంచుక యూరకుండి)

ఉ. మామక భాగధేయమగు • ముంబున నీకొలిజన్మమందె, నీ
తామరసాయతేక్షణ • కతంబున దావకీ బాంధవానుగుఁ
భామిత వైభవంబు నెసె • నస్వర్గ్భృతాఢ్యుఁడన్నై తినింక నీ,
శ్యామను గూర్చి నేలుకొను • మయ్య జలంధర భూమినాయకా

(బృందను జూచి) అమ్మా! బృందా! భవదీయపూర్వ పుణ్య విశేషమున నీజలంధరుఁడు నీకుఁ బ్రాణేశ్వరుండైనాఁడు. సకలమెఱింగిన నీకు నేనేవియుఁ జెప్పనక్కఱలేదు. అయినను వాత్సల్యమునఁ జేసి చెప్పుచుంటిని.

సీ. భయభక్తులను బూని • పరమానురాగవై
చెలువుని కన్నుసన్నలమెలంగి
చిత్తమెందే వేళ • బత్తి పెంపొందఁగా
వృద్ధులకును సేవ • వెలయఁజేసి
యాప్తబంధు జనాళి • నాదరంబునఁ గాంచి,
మృదుభాషణముల స • మ్మోద మొసంగి
గర్వమించుకయు లేక • కరుణతో నతిథుల
నిష్టమృష్టాన్న సం • తృప్తిఁ జేర్చి
తే. గీ. కరుణవీడక సత్యంబు • మఱువకుండ
నిట్టి సాధ్వీలోకంబున • నెందు లేద
టంచుఁ బ్రజలెల్ల వినుతించు • నట్టిభంగి
నుభయకుల పవిత్రవగుచు • నొప్పుమమ్మ.

మ॥ అనిశంబున్ రమణప్రియా చరణ కా • ర్యాయత్త చిత్తాబ్జవై
యనువర్తించి జగంబులందున మహా • ఖ్యాతిన్ బ్రవర్తించి రా

యనఘస్వాంతలు భూరిశాంత లనసూ ♦ యారుంధతీ కాంతలం
గన! నీవట్లు సుకీర్తిం జేకొనం దగుం । గా భర్తృసేవారతిన్.

మ, ఆర్యులటన్న మేల్ ప్రణామము । లన్నను దేవతలన్న శాశ్వతై
శ్వర్యములన్న నిర్మల యశంబులటన్నను బంధులన్న
సత్కార్యములన్న భాగ్య సుకృతంబులటన్నంగ మారి నీకు, నీ
యాగ సుతుండె సర్వమని ♦ యాత్మ దలంచి చరింపుమమ్మరో

చ॥ సతివయి జన్మగోత్రము ♦ యశంబుఁ బెంచింపుము మావధూటి వి
స్తృతిని జవల్లభాలయము ♦ చెన్నువహింప నొనర్పు ముక్తలా
పతివయి పాత్రి నాథువర ♦ భావ కుతూహల మాచరింపు మీ
గతి విలసిల్లినన్ వినుము ♦ ఖ్యాతివహింతువు లోకమందునన్

బృంద—తండ్రీ నీయుపదేశ వాక్యములు నాహృదయ ఫలకమున
లిఖించుకొని యుందును.

మణి—(జలంధరుని జూచి)

సీ. జననమందిన దాదె ♦ జననిని నెన్నదు
విడనాడి మెఱుగని ♦ విద్రుమోష్ఠి
పురమును నేబాసి ♦ యరిగినప్పుడు నాదు
రాకకై వేచెడు ♦ రాజవదన
మొండకన్న ననేమొ ♦ యెన్న డెరుంగక
సౌఖ్యంబు లందెడి ♦ జలజనయన
కోపంబు నొక్కింత ♦ చూపినగన్నుల
నశ్రువుల్ నుంచెడి ♦ యతివమిన్న

తే. గీ. మామకతనూజ యోసతి ♦ మాన్యచరిత
భార్యయయ్యెను నీకు నే ♦ భంగిదీని
సరసి రక్షింతు వోకృపా ♦ కరుడవగుచు
భారమంతయు నీయదే ♦ పార్థివేంద్ర

ఉ. ఆకలి గొన్నఁ దాసదుగ । దన్నము కుత్తుకయొండి యుండినన్
గ్రా గొనబోదు దాహమును । గన్గొని పెద్దరి యివ్వగావలెన్
మాకును జెప్ప నేటియును । మాన్య చరిత్ర! సుశీల నీమనీ
వేకరణిన్ కృపాగసము । నింపుచు నింపుగ నేలదో కదా

జలం——(తనలో) నాకీతని పలుకులే వినబడు చుండుటలేదు పుష్ప హార మీమె కరమునుండి పడినంతనే నాకీయువిద యందున్న మోహమే పోయినది. ఆహారము నాకు నతిక్రమింప జాలక యీమె నుగ్రహించితిని. (ప్రకాశముగా) కృపాలాగ్రణి! ఇంక మేము పోయి వచ్చెదము.

బృంద——తండ్రి నాథుని వెంట నరిగెదను (విచారించుచు).

మణి——కుమారీ చింతింపకుము లోకైక వీరుండగు జలంధరుడు నీకు భర్తయయ్యె నీభాగ్యము వర్ణింపదరము కాదు. అప్పుడప్పుడు నీకుశలవార్తల దెప్పించుకొను చుందుము మేమును వచ్చిచూచు చుందుము. నీకిచ్చటనుండి కావలసిన యమూల్య వస్తుచయమును బంపుచుందుము. నీపతియనుజ్ఞ బడసి తీసికొని వచ్చుచుండుము.

జలం—— దేంద్రా! ఇంక మే మరిగెదము.

మణి——శుభమగుఁగాక. పోయిరండు.

(అందఱును నిష్క్రమింతురు.)

రంగము:—3. [వనము — ప్రవేశము — బృంద]

బృంద——(తనలో) ఎంతభాగ్యముండిన నేమి? ఎట్టిసౌఖ్యములు గలుగు చుండిన నేమి? అగ్నిహోత్రుని సాక్షిగఁ గొన్న సతి పతిచే నిరాకరింపఁ బడినప్పుడివియన్నియు నిరర్థకములు గదా! అక్కటా నాభర్త కృత్యములకు నేనేమని చింతింతును? బ్రహ్మ వరప్రసాదిత మహారాజ్య జలనంపన్నుఁడనియు, సుగుణమూర్తియనియు

దగునది, మనసారవివాహమాడితివిగాని యిట్లగునని కలనైనఁ దలంప నైతినిగదా !

తే॥ గీ॥ ఎట్టి సౌందర్యముండిన ♦ నేమి? యెట్టిభోగ
భాగ్యములుగల్గిననేమి ♦ భర్తచేత
జూడఁగాఁ బడనట్టి యా ♦ సుదతి బ్రతుకు
కానఁ గాచిన వెన్నెల ♦ కరణిగాదె.

నాథునకు నాయందనురాగము లేకపోయినఁ బోవుఁగాక! పరసతుల భంగము సేయు తలంపు మానుమని యెంత చెప్పినను వినఁడయ్యె. మునియాశ్రమంబులఁ బ్రవేశించి వారాశ్రమమున లేనితరిని దత్పత్నుల బలిమిం బట్టఁదలంచుచుండును. పరనారి కంటఁబడుట భయముగానున్నది. ఈ దురుద్యోగమునుండి యాతని చిత్తము ద్రిప్పుటకెంత ప్రయత్నించినను నాప్రయత్నము కొనసాగకయున్నది.

సీ॥ తనుఁజేరి నామీఁద ♦ నెనరుంచుమని వేడ
వినఁడాయె, దాయఁగాఁ ♦ గనుచు నన్ను
పరకాంత గవయుట ♦ పాపమంచును నెంచ
డాయెగాఁ, నేనెంత ♦ డాసి పలుక
మానులనేచుట ♦ మానుమంచునుఘోర
మానఁడాయెముదంబు ♦ బూనగాని
పరధర్మపథమంచు ♦ వర్తింపుమని పల్క
గొనఁడాయె నాపల్కుఁ ♦ గోపమూని

తే॥ గీ॥ ఎంతవేడినఁగాని తా ♦ సంతరైన
మనసు కరుగదు నామీఁద ♦ మన్మనోధి
భునకు ; నేమిసేయుదు నేఁడు ♦ బ్రోవ వేఁడు
దానఁ బ్రాణేశ్వరుని మంచి ♦ దారిఁబెట్ట.

ఇదియంతయు నేను తొలిజన్మమునఁ జేసిన పాపమీవిధముగఁ బరిణమించినది. ఇంతకును భగవదాజ్ఞకు నన్యథా యెవరు సేయుదురుగదా ! శక్తియుంచక లేకుండ నపీతేశ్వరుని సన్మార్గమునఁ బెట్టఁజూచెదను

(తెరలో)

దేవీ! బృందా! బృందా!

బృంద—(ఎదుటఁజూచి) అదిగో! నన్నరయుచు నవమాలిక వచ్చుచున్నది.

నవమాలిక—(ప్రవేశించి) దేవీ! బృందా! నీవా జలజాకరతీరంబున నుంటివేమోయని తలంచితిని.

బృంద—లేదు. ఇక్కడనే యుంటిని.

నవ—దేవీ! మనయొకింత కాలము మీావనంబునఁ జరింతమా! అటు జూడుము. ఉల్లంబులు రంజిల నెల్లెడఁ గొల్లగఁ బూసియున్న మల్లెలును, మిగుల సువాసనచే నెగడుచుఁ జెట్లక్రిందఁ బడియున్న పొగడలును, మదనుని కరంబునందుండు బాకులోయనందగు కేతకీపువ్వులును, మొదలగు సమస్త విరులును సంపూర్ణముగ పూచియున్నవి.

బృంద—(తనలో) నాచిత్తము వనవిహారమునకు సమ్మతించునా? నిరంతరము మనోహరుని గూర్చిన చింతయేగాని మఱియొక విధమగు చింతయేలేదు అయినను నాపరితాప మీా నవమాలిక యెఱుంగనేల? ఇట్టిది యొకరు వినవలసినది కాదు. (ప్రకాశముగా) నవమాలికా! ఆ పుష్పసంతతులకేమిగాని యిటు జూడుము చిలుక ముక్కులచే నొక్కబడి కెంపురుచు లీనుచున్న దాడిమ ఫలంబులెట్లున్నవో అహా! వనరామణీయకము కన్నులకు బంధువై యున్నది.

మ. స్వనితాంతాహతి కోర్వలేకను తరు ♦ చ్ఛాయాప్రదేశంబుచే
త నరణ్యంబున దాగియుండు బహుళ ♦ ధ్వాంతంబునన్ రూపుమా
ప ననేకాకృతులన్ ధరించి యునఁడీ ♦ వన్యల్ బ్రవేశించెనో
యన శోణద్యుతితో ఫలావళులు సం ♦ డాగెన్ మహీజంబులన్

ఇదిగో! ఈపరిక్రోశకువచ్చి, సకలసురమునిరాజ పూజానిదానములును, మిళిందవ్రజనిధానములును, స్వదర్శన పరిభేదిత విరహిలోక పరితాపమానములును నగు సూనంబు లెట్లు మహితరుచుల నొప్పుచున్నవో చూడుము.

నవ—వానికేమిగాని యిటు చూడుము.

మ. చపలాక్షీ! ఘన సాధ్వివైన నినునో ♦ జన్ జూచి యుక్తాళ్యనీ
కపుగీతంబుల సియ్యశోకలతికా ♦ వారంబు నీకున్ బ్రవా
ళపు పూజాక్యమయంపు బాత్రికలఁగా ♦ శుభదీర సూనప్రదీ
పవుబింబూనుచు మంగళారతులిడన్ ♦ భక్తిపరిపక్తిక్రియన్.

బృంద—సఖీ! ఆ కాసారతీరమున నాబకవ్రజమెట్లుండెనో చూడుము.

నవ—దేవీ! పరాంగనల గవయఁదలంచి చడియుఁజప్పుడు గాకుండ ఇటునటు తారులాడు విటకాండ్ర చందమున, మీనంబులఁ బట్టుటకై యాబకములు దొంగతపము సేయుచున్నవి.

(విష్ణుమూర్తి ప్రవేశించును.)

విష్ణు—(తనలో) ఈమెచెలికత్తె నన్నుఁదిలకించెనా యేమి? (పరికించి) లేదు. లేదు. (ఇంచుక యూరకుండి) జగత్పరిరక్షణకార్యదీక్షా ధురంధరుఁడనైన నాకీబృందపై మోహము జనించుటకుఁ గారణము నేనే యూహింపఁజాలక యున్నాను.

తే, గీ. సకలభువనములశాసింప ♦ జాలునాకు
బృందపై మోహమీరీతి ♦ పొలయుటడ
జగము దీనిని విన్నచో ♦ నగదె? హరియె
యిట్టి దుష్కార్య మొనరించె ♦ నే యటంచు!

చిత్తమును నీ యుద్యమమునుండి మరలించుటకెంతి ప్రయత్నించినను మరలకున్నది. (ఇంచుక యూరకుండి) బృందమహాసాధ్వి.

నిరంతర పతిసేవాపరాయణ. జలంధరుఁడు విరించి వరసంజనితబల
గర్వోద్రేకుఁడై చరించుచున్నను, నామెయాతనిని దైవమువలెఁ
బూజించుచున్నది. జలంధరుఁడెట్టి దుష్కృత్యములనేయుచున్నను
నాబృంద మంగళసూత్ర మహిమమున నాతఁడేవిధమగుహానియు
జెందకయున్నాఁడు. నేనీబృందకు నాయభీష్టము దెలిపెదగాక
ఆమె యందులకు సమ్మతించనేని నా మోహాగ్ని చల్లారుటయేగాక
దుర్నీతిపరుఁడైయున్న జలంధరుఁడు మడియును. దీనం జేసి దేవత
లకు హితము జేసిన వాఁడనగుదును. అట్లుగాదేని బృందసాధ్వీశిరో
మణియను విజయధ్వజము జగంబున నిలిపిన వాఁడనగుదును.
ఏమైనను బృంద సౌందర్యము నాచిత్తమును సంపూర్తిగ నాకర్షిం
చినది.

తే. గీ. కొమ్మఁగన్నఁ బమ్మనున్నైన । రిమ్మతెగులు
గలుగుననుమాట నాయెడ । నిలిచెనిపుడు
గాకయుండిన నేనేడ । కలికికొఱకు
హృదయమున మోహమూని చ । రించుటేడ?

ఆహా! వైకుంఠ పురంబెక్కడ! ఈజలంధరుని పురంబెక్కడ!
బృందపైనున్న మోహము నన్నింత దూరముగొని వచ్చినది.

బృంద — (చెలికత్తెనుఁజూచి) సఖీ! నవమాలికా! వనవిహారమిఁక
చాలించి గృహమునకుఁబోవుదమా?

విష్ణు — (తనలో) ఈమె గృహంబున కరుగునాయేమి! ఈమె వెంట
చెలికత్తెయుండఁగా నేనెట్లు సంభాషించుటకు సాహసింతును?

నవ — బృందా? గృహమున కరుగుటకుఁ దొందరపడనేల; ఆ జాజి
పూవులం గోసికొనివత్తము. రమ్మా. (బృందతో నిష్క్రమించుచు)

విష్ణు — (ఎదుటఁజూచి) అహా! ఏమి? ఈమె సౌందర్యము జగన్మోహన
మైయున్నది.

మ॥ త్రిజగన్మోహన కాంతిఁ గాల్చి, తనువుల్ ♦ దీపింప బ్రాభాత నీ
రజ బంధుప్రభఁ గూర్చి నెమ్మొగము నా ♦ రాకానిశానాథు, న
క్ర జమై నవ్వగఁ జేసి, బృంద నిటులో ♦ కంబందు సృష్టించె, నా
యజనిర్మాణపుఁ బ్రౌఢిమెచ్చనగు న ♦ హ్వామానసంబందునన్

నిజముగా సృష్టికర్త తన నేర్పంతయు నీమె నిర్మాణమునందుఁ
జూపినాడు అందుచేతనే చతుర్దశభువనంబులయందు నీ సతులకు
సౌందర్యమున దలకట్టై యున్నది.

ఉ. ఈరుచిరాంగి విశ్వధర ♦ నిందరి పురంధ్రులఁగూడమించి వి
స్తారము సందముండునని ♦ ధాత వధూటి లలాటవాటి నిం
పారఁగ వ్రాయనోవు నటు ♦ లౌటనె యీజలజాక్షి కిట్టి యా
కారము గల్గెఁ; గాని మొడ ♦ గల్గెనె వేరొక కాంతి కెందునన్.

(పరికించి) కాంతామణిసౌందర్యమెంతచూచినను దనివితీరకున్నది.

సీ పద్మాస్యవేణితో ♦ బ్రతిగాక కాబోలు,
వల్మీక ములఁ జేరె ♦ ఫణులపంక్తి
తరళాక్షి మోముతో ♦ సరిరాక కాబోలు
బహుళరాత్రి సుధ్రిక్కును ♦ పద్మవైరి
యింతి చందోయితో ♦ నెనగాక కాబోలు
గతులు వాసె నల వ ♦ ర్వతపుసమితి
కలికి నెన్నడుముతో ♦ దులగాక కాబోలు
చేరె గుహాలయందు ♦ సింహతతులు

తే. గీ. పొలతి కుచయుగులకోడి కా ♦ బోలనంట్లు
తలలు వంచుకొని నిలిచె ♦ దరుణ పాద
ములకు సదృశంబుగాక కా ♦ బోలు కమల
గణము పంకోదయావాప్తి ♦ గాంచియుండె.

ఈయాకృతింగాంచి యెట్టివారైనను మోహసాగరంబున బడుట
నిశ్చయము.

తే. గీ. కామ రహితుఁడయిన మోక్ష ♦ కామిమైన
నిర్మలాత్మ్కుండె మైనను ♦ నిపుణుఁడైన
నమిత వేదాంత విదుఁడైన ♦ ననఘుడైన
నువిదఁ గాంచిన మోహంబు ♦ నొందకున్నె

(పరికించి) అదిగో బృంద చెలికత్తె పూవులంగోసికొని
నేమిమో చెప్పుచున్నది. ఇఁక నామె గృహంబున కేగునాయేమొ!
(మరలఁజూచి) చెలికత్తెతో మరల నేదియో పలుకుచున్నది.

( తెరలో )

నవమాలికా! నీవీపూవులంగొని గృహంబునకరుగుము. నేను భగవంతుండగు శ్రీమన్నారాయణుని పూజార్థమై ప్రత్యేకముగనొన్ని పుష్పములు సంగ్రహించుకొని వచ్చెదను.

విష్ణు—(తనలో) అదిగో ఈమె చెలికత్తెను గృహమునకుఁ బంపివేసి మదీయ పూజార్థమై విరులం గోయ నీప్రక్కకు వచ్చుచున్నది ఈమెంజేరి భాషించుటకిది యెంతయు మంచి సమయము.

(బృంద – ప్రవేశించును.)

బృంద—[తనలో] నవమాలికను గృహంబునకు బంపితిని. విష్ణునకుఁ బ్రీతియగు నాపుష్పములను గోసికొని నేనుగూడ సత్వరంబుగ నరిగెదఁగాక.

(పూవులు గోయుచుండును)

విష్ణు—(తనలో)

మ॥ అకలంకోజ్వల గాత్రియై తనరు నీ ♦ యంభోజపత్రాక్షి మా
మక సమ్మోహ కలావిశేషమును బెం ♦ పంగానిటంజేర నే
నిఁక సందేహము నంతయుఁ విడిచియీ ♦ హేమాంగినింజేరి మా
మక మోహంబెఱిఁగించి సమ్మదమువం ♦ భాసిల్లఁగాఁ జూచెదఁ
నేమిమో [illegible]బడెదఁ గాక (బృందయెదుటకు బోవును)

బృంద — (విష్ణుమూర్తిని జూచి తనలో) ఎవ్వరీ పురుషుడు? శుద్ధాంత కాంతలగు నేను విహరించు నీవనంబునఁ బ్రవేశించెను. చెలికత్తెను గూడ గృహంబునకుఁ బంపితిని. (ఇంచుక యావలకుఁ బోయి) ఆహా! ఈమహాత్ముని తేజము వనంబంతయుఁ బ్రకాశింపఁ జేయుచున్నది. ఈదివ్యపురుషుండెవ్వఁడోకదా! ఆలోచించిచూడ నీమహానుభావుఁడు త్రిమూర్తులలోనొకఁడై యుండును. మదీయ పురాకృతసుకృతంబునం జేసి శ్రీహరియె యిట్లు సాక్షాత్కరించి యుండెనని తలంతు. (ఇంచుక యూరకుండి) నాహృదయమున నదియొక విధమగు భయముగూడ జనించుచున్నది. ఏమైనను బరపురుషుఁడగు నీతనితో నెట్లు భాషింతును? నేనింక సత్వరముగ గృహమున కరుగుటయే మంచిది. (పోబోవుచు)

విష్ణు — (ఎదురై) బృందా! నిలువుము. నిలువుము.

బృంద — (ఇంచుక భయము నటించి) ఈమహానుభావుఁ డెవ్వఁడో నన్ను నిలువరించినాడు. ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) ఈపుణ్యమూర్తియెవ్వరో యెరిఁగెదఁగాక! ఇంతమాత్రమున నాశీలమున కేమి భంగ మొదవును? (ప్రకాశముగా)

మ. కమలా కాంతుఁడవో! ప్రభాకరుఁడవో • కామారివో భారతీ
రమణీనాథుఁడవో శచీపతివో తా • రాభర్తవో నీవు తే
జము నిండెఁ బెకలెల్లయెవ్వఁడవు, యీ • చందంబునఁ వచ్చినా
వు! మహాత్మా! కరుణన్ వచింపుము నినుఁ • బాల్పొర బ్రార్థించెదన్.

విష్ణు — తరుణీమణీ! ఇప్పుడు నీవు చెప్పినవారిలో నొక్కఁడను.

తే. గీ. భక్తమానస పీఠి ని • వాసభూమి
భక్తరక్షణ కార్యంబు • పరమ హితము
నఖిల దేవతాతతి నాకు • నాప్తసఖులు
గాగ వెలుగు చుందును నేను • కంబుకంఠి.

చ. మరమున సంతతంబును స ♦ మంచిత భక్తిని బూనుచూ దురం
తనిరతి నట్ట భజించెడి బు ♦ ధ ప్రకరంబున కిష్టమై భవం
బును ఘటియించుచుందుఁ బరి ♦ పూర్ణకృపారస ధారలొల్కుచూ
వనరుహపత్రనేత్ర నను ♦ భావమునందు గ్రహింప కుంటివే?

బృంద—(తనలో) ఈతని పలుకులు మర్మగర్భితములగనున్నవి. ఈతని జగదానంద కరంబగు రూపముజూడగా శ్రీమన్నారాయణుఁడని తలంచెదను. మఱియు సుకృతంబుఁ జేసి, యీపుణ్యమూర్తి నన్ను కృతార్థులఁ జేయ నిచ్చ్యోడకు విచ్చేసియుండును. (ఆలోచించుచుండును)

విష్ణు—ఓకుటిలకుంతలా! ఆలోచించుచుంటివేమి? ఎవని పూజార్థమై యిప్పుడీ పుష్పములను నీవు గ్రహించుచుంటివో, యతనిగనన్ను భావింపుము.

బృంద—(సంతోషముతో తనలో) నేడు నాపుణ్యము పండినది. ఇమ్మహాత్ముఁడు సాక్షాదిందిరా నాథుఁడు. (తనలో)

సీ. ఫాలార్ధ చంద్రుపైఁ ♦ బ్రాపించు నీలాంబ్రి,
కోటినా నెగడు ముం ♦ గురులవాని
రమణీయలావణ్య ♦ రసపరసి జనించు.
తొగలు నా తనరు కం ♦ దోయివాని
కరితుండముల నేలి ♦ పరమభక్తులకు సం,
తత మభయ మిడు హ ♦ స్తములవాని
వజ్రపంజరనిభం ♦ బై సతతంబును,
సిరికాటపట్టైన ♦ యురమువాని

తే. గీ అఖిలలోకములకు మూల ♦ మైనవాని
కలితభక్తరక్షణ దీక్ష ♦ గలుగువాని
నిఖిలమునిజన సన్నుతి ♦ నెగడువాని
నాదినారాయణుని గంటి ♦ నార్తిదీర.

(ప్రకాశముగాఁగరములు మోడ్చి.)

సీ. కలశవారాశి యో • లలిత చరితునకుఁ,
భావనంబైన ని • వాసభూమి
వేయి జిహ్వలుగల్గి • వెలయు శేషాహియే,
ధీరగుణుండు ని • ద్రించుపాన్పు
వినతాడ కప్పుడు • వెంటనేయుండెడి,
పక్షీంద్రుఁ డెవ్వాని • వాహనంబు
సకలజనతతి క్కై • శ్వర్యమ్ము నొసగెడి
యిందిరా జలజాక్షి • యువిదిదేవి

తే. గీ. వర సురలుమును లెవ్వాని • వందిజనులు
భక్తరతుఁడ మెవ్వాని • పరమహితము
నట్టి, లోకైకనాథుని • నమలచరితు
గాంచఁగఁటిని కన్నుల • కఱవుదీర

దేవా! శ్రీమన్నారాయణా! పరమనిష్టాగరిష్ఠులై ఘోరతపం బొనర్చు మునీంద్రులకయినను లభింపని నీదివ్యమంగళవిగ్రహ సందర్శనము నేడు నాకు లభించినది. జగద్రక్షుఁడవగు నిన్నుఁ బూజించు క్రమముగూడ దెలియనియజ్ఞానురాలను. నన్నెట్లురక్షించెదవో!

విష్ణు—సతీమణీ! బృందా! నేను భక్తసులభుఁడను. నీపైన నాకున్న యనురాగమే యిట్లు సాక్షాత్కరింప జేసినది.

బృంద—దేవా! లక్ష్మీకళత్రా!

మ. సరసీజాతభవాది శంకరులు న • శ్రాంతంబు సేవింపఁ బె
ల్లిరవై మించు మహానుభావుడవు నీ • విబ్భంగి నన్నుం గనన్
వరకారుణ్యము బూని నీదు నిజమా • పత్కాలతో నచ్చుట
ద్ధిర భాగీరథి చొటినేలపయిన • ధ్వన్ బారినట్లోకదా.

విష్ణు — చకితాక్షీ ! ఇందు నీవు నన్ను వినుతింపవలసిన పనియేమియును లేదు. నిరంతరము నీచిత్తము నాపైననిలిపియున్న దానవగుటంజేసి భక్తిభావంబున నీకు నేను గట్టుబడితిని భక్తులెవ్వరును నన్నంత సులభముగా వశముజేసికొని యుండలేదు.

బృంద — మహాత్మా ! నాపై నీకు నిట్టికరుణ జనించినదిగాని, నిరాహారులై వాయుభక్షణ సేయుచు మహారణ్యములందు పరమ కష్టలు బూని ఘోరతపమును జేసిన తాపసోత్తములకంటె నేనెక్కువదానవా !

విష్ణు — (తనలో) నెమ్మదిగా నాహృదయము మీమెకు దెలియ జేసెదగాన (ప్రకాశముగా) బృందా! నన్నుగట్టి వేసినది నీశక్తిపాశ మొక్కటియే కాదు.

బృంద — కేవలమూఢమతినగు నేనెట్లు భక్తురాలనని చెప్పగుదును ఆర్తరక్షణా! ఇందు నీకరుణా విశేషముదప్ప మరియొకటి లేదు.

విష్ణు — అదియును గాదు

బృంద — దేవా! ఇంక నేనేమి చెప్పగలను

చ॥ వనజదళేక్షణా ! విమల ♦ భక్తజనావనసిద్ధదివ్య ద
ర్శనమున మత్కఠోర కలు ♦ ష ప్రకరంబు దొలంగ జన్మపా
వనత లభించె నిప్పుడు, స ♦ వార్థకృతార్థతగంటి మత్పురా
తనకృత పుణ్యమెట్టిదో క ♦ దా! నిను జూడగగంటి మాధవా!

విష్ణు — శశివదనా! నన్ను వీక్షించుటంజేసి నీవు కృతార్థురాల వయితివి. నిన్ను వీక్షించుటచేత నేను కృతార్థుడ నగుదును.

బృంద — (తనలో) ఈదేవాది దేవుడిట్లు వచించుచుండె నేమి (ప్రకాశముగా) జగత్కల్యాణమూర్తివగు నీవు నన్నిట్లు బలుకనగునే!

విష్ణు—

మ॥ అతివా! సందియ మింతలేదు వినుమ స ♦ త్యంబిద్ది లక్ష్మీసతీ
పతినై యుండి సమస్తలోకములు బెం ♦ పన్ జాలి బృందారకుల్
కుతుకంబూనుచు భక్తిమై గొలువ నై ♦ కుంఠంబునం దుండు, నే
నతి మోదంబున వచ్చినాడ నిటు నీ ♦ కై యొక్క కార్యార్థమై.

బృంద—మహాత్మా! నీవాక్యము నాకెంతయు వింతఁగొలుపుచున్నది. దేవాదిదేవుండ వగు నీవు నాకడకుఁ గార్యార్థివై వచ్చితినని పలికిన నేమనఁగలను?

విష్ణు—నారీమణీ! ఇదినిశ్చయమే! నేనునిన్ను యాచించుటకేవచ్చితిని.

బృంద—సమస్తయాచక జనచకోర చంద్రుఁడవగు నీ వొరులను యాచించువాఁడవా! ఇట్టి వింతగలదా!

సీ॥ రత్నాకరము నీదు ♦ రమణీయ వాసంబు
జీవనంబెంతరా ♦ చెలఁగుచుండు
ఇందిరాదేవి నీ ♦ హృదయ మందుననిల్చి
ధనమున కేమియు ♦ దఱుగులేదు
భూదేవి రెండవ ♦ పూబోఁడి యగునీకు
గోరిన పంటల ♦ గురియుచుండు
నిఖిల బృందారకుల్ ♦ నీయాజ్ఞ నుందురు
పలసిన దంతియు ♦ భక్తినిచ్చి

తే॥ గీ॥ అట్టి నీవేడ! యొరులను ♦ యాచనంబు
సేయుటేడ! నీవాక్యముల్ ♦ చిత్రమయ్యె
నెందుకీరీతి బల్కితో ♦ యింతయైన
కారణ మెఱుంగ కుంటిని ♦ గమలనాథ.

విష్ణు—కుందరదనా! నేను చెప్పినమాటయం దసత్య మావంతయును లేదు. నామనంబున లోకవిషయమైన కోరిక యొదవుటం జేసియే నీ కడ కరుదెంచితిని. ఆకార్యము నీవలనఁ జక్కబడవలయును.

బృంద—(తనలో) భగవంతుడగు నీ శ్రీమన్నారాయణుని వాక్యముల యందర్థము నాకుఁ దెలియుట లేదు. ఒకవేళ నన్నుఁ బరీక్షింపఁ దలంచి యేదియేని నెరవేర్చుట కశక్యమైన కోరికఁ గోరఁడుగదా! (ప్రకాశముగా) దేవా! జగత్కర్తవగు నీకోరిక దీర్చుటకుఁ దగినంత శక్తురాలనా? నాయందుగరుణ యుండుటంజేసి యిట్లువచించెదవుగాని, కాకున్న నేనెంతదానను. అయినను గృపాంతరంగుండవై భవదభీష్టమెట్టిదో యానతిచ్చితివేని, నీకరుణకుఁ బాత్రనై యశమందు భాగ్యము నాకుండునేని, చేయఁ జూచెదను.

విష్ణు—బృందా! నా యభీష్టము నీవు దీర్పఁదలంచినచో దీర్పఁగలవు; కాని చెప్పుటకు నాచిత్తమే యొక్కింత వెనుదీయుచున్నది.

బృంద—మహాత్మా! భక్తులయందట్టి సందియము నీకుండఁగూడదుకదా!

విష్ణు—[తనలో] ఇంకఁ గాలహరణం బొనరింపక నాయభిప్రాయమెఱిఁగించెదగాక! మోహామణీ! నన్నిచ్చ్యోటకు నాకర్షించి గొని తెచ్చినది నీసౌందర్యమే కారణము.

తే. గీ. జగములందున నున్నట్టి • సతులలోన
నందమున మేటి వగుచును • నెఱుసట్లు
గలిగె నిన్ను సృష్టించె నా • కమలభవుఁడు
భవ్యభవదీయ భాగ్యంబు • బలుకవశమె.

బృంద—(తనలో) ఈజగత్కర్త నాసౌందర్యమును గూర్చి పలుకుచుండెనేమి? (ఆలోచించుచున్నది)

విష్ణు—

మ. అనుమానింపక తెల్పుచుంటి వినుము • ద్యద్రాజబింబాస్య; నీ
ఘనసౌందర్యమె తెచ్చె నిచ్చ్యోటకు, జ • క్కంగట్టి నన్నిప్డు, నీ
వనుమానింపక డెందమందు మనభీ • ష్టావాప్తిఁ జేకూర్చెదో
విని దోషంబిది యంచు లోఁదలఁతువో • బింబోష్ఠి యేమందువో.

తే. గీ. సకల జగములు రక్షింపఁ ● జాలినట్టి
నేనె నీకురూపముగాంచి ● నెలఁత మోహ
మంది భవదీయ రక్షణం ● బందవచ్చి
నాఁడ, నెట్లాదరింతువో ● నాతిమిన్న.

బృంద — (తనలో) అక్కటా! సర్వజగన్నియామకుండయిన యీ భగవంతుఁడు నన్ను మోహించెనుగదా! ఇట్టి వింత యీతని విషయమున మున్నెన్నఁడైనా వినియుంటినా? శ్రీమన్నారాయణుండగు నితఁడెక్కడ? సామాన్య యువిదనగు నేనెక్కడ? నన్ను గామించుటేమి? (ఇంచుక యూరకుండి) భగవంతుఁడగు నీతఁడు మదీయ పాతివ్రత్యము పరీక్ష సేయదలంచి యిట్లు గోరియుంటినని తలంచెదను. నేనీ మహానుభావునకు నేమని ప్రత్యుత్తర మిత్తును (ఆలోచించి) కానిమ్ము. నా భక్తిఁ జూపుచు నెమ్మదిగా నిట్లుబలికెద గాక! (ప్రకాశముగా)

సీ. శ్రీమద్వైకుంఠపు ● రీ నిలయుండవైయుండి;
ధర్మపద్ధతివీడి ● తనరుటేమి
అక్షీణ లక్ష్మీక ● టాక్షదీక్షుండవయ్యు
నిట్టికోరిక మది ● నెంచుటేమి
పదునాల్గు భువనముల్ ● పాలించు మేటివై
యీరీతిఁ బరసతి ● గోరుటేమి
సకలభక్తజన ర ● క్షకుఁడవై, నెలతకై
మోహంబు నీభంగిఁ ● బొందుటేమి

తే. గీ. చిత్రముగఁ దోఁచె నీదగు ● చిత్తవృత్తి
నాగుణము బరీక్షింప, మ ● నంబునందు
దలఁచి యీవిధంబుననుఁ ● బల్కియుందు
వంతెగాని నివేడ యి ● ట్లడుగుటేడ

భువనశాసనుడవై నీవు నాచిత్తము బరీక్షింప నిట్లు గోరితి వని తలంచెదను. కాకున్నచో నీ కేడ యిట్టిబుద్ధిని బూనుటేడ?

విష్ణు— ఓరమణీ శిరోమణీ! నేనెట్టివాడనైననేమి? నీసౌందర్యము నా చిత్తము నాకర్షించినది.

శా. మోహా! దోషమటంచు లోకులపకే । ర్యోగీంద్ర మోక్షప్రదున్
భాషేశాది సురస్తవాభరణ వి । భ్రాజాత్మునిన్ నన్ను సం
తోషంబందగ జేయుమీ, యదియె సం । తోషంబు నీకిచ్చు నీ
కీషన్మాత్రము నిందరాదవని, లే । నేనే నే రక్షింపగన్

బృందా— ఈవిషయమున నీవు సందియ మందవలదు. నీయశమున కావంతయు భంగముగాని మార్గము నేనరసెద.

బృందా— (తనలో) ఆహా! ఏమి యీవింత! ఈతండు నిశ్చయముగా నాపై మోహమునందియే యిట్లు వచ్చినాడు. భగవంతుడగు నీతనికే యిట్టిబుద్ధి పుట్టినచో నెవ్వరు మరల్పగలరు! వినయవాక్యములచేత నీతని చిత్తమును ద్రిప్పివేసి యిమ్మహాత్ముని యనుగ్రహమునకు బాత్రురాల నగుటకుఁ బ్రయత్నించెద. (ప్రకాశముగా)

మ. అకటా! యేమని పల్కుదాన నిను దే । వా! నన్ను నింతైన నెం
చక కామించితివయ్యయో యిది జగం । బాలించినన్ సంశయిం
పక నిన్నున్ హరియే పరాంగనకునై । భావంబులో నిట్లు రో
యక మోహంబును జెందెనేయనుచు నిం । దాడంగ నూహింపరే

నీవు మహానుభావుడవు సకల సృష్టిస్థితిలయంబులకు గారణుండవు.

మ. అమలమనీష నిన్ గొలుచు । నమ్మహితాత్ములు పుత్రమిత్రవ
ర్గముపయి మోహముల్ విడిచి । రాజిలియోగులు నాచునుండగా
భ్రమగొని నీవె యిట్లు బర । భామరతంబున గాసజెందెదే
సుమహిత సద్గుణాభరణ । చోద్యము నీదుచరిత్రమెంతయున్

ఏమహానీయుని కీర్తినోగ్రశ్రవమున వితతారివడ్వర్గ లతికావితానము దెగునో, ఏశుభప్రదుని చింతనార్క ప్రభలచే సంసార

తమనవాశ్రిత మడంగునో, ఏదేవ దేవుని సేవాదవానలశిఖలు, విపద్ధశాటపని దహింపజేయునో, ఏ మహాపురుషుని భంజనాంజనముచే నపవర్గనిధి గానిపించునో, యట్టి యాదినారాయణుండవగు నీవిట్టి కార్యము సేయుట కుద్యోగించిన నేనేమనఁగలదాన? పుండరీకాక్షా! ఒక వేళనీవు నాచిత్తవృత్తి నరయఁదలంచి యిట్లు బలికితివేమో! నీ వావిషయమునఁ సందియమందఁ బనిలేదు. పతిపదాంబుజసేవయు, భగవంతుఁడవగు నీ శ్రీసత్పదసేవయుఁ దప్ప, నన్యసుఖ మేమియు గోరను కావున నాయందనుగ్రహంబూని, నీచిత్తమును మరల్చుకొని, నీభక్తురాలిగ నన్ననుగ్రహింపుము.

విష్ణు—

మ॥ అతివా! సందియమందనేమిటికి సు ♦ ద్వత్రీప్రీతి విష్ణుండె యీ
గతి, సామాన్య తలోదరీమణిని నొ ♦ క్క్రూరైర మదిం గోరి, యం
చితమోహంబున జేరి వేడగను, వా ♦ సింబొందగా నెంచకీ
గతి, వాక్రచ్చెడి మోహనాంగి కలదే ♦ కల్యాణిమెందైననున్.

శశాంకవదనా! బృందా! ఇది యధర్మకార్యంబని చిత్తంబునఁ దలంపవలదు. మదీయాభీష్టము దీర్చుటవలన నీకు దుర్యశము గలుగునని తలంచవలదు. నాచేతఁ జేయఁబడిన యెట్టికార్యమైనను ధర్మము గనే ప్రకాశించును. ఇదియుంగాక నీవునాకోరిక దీర్చితివేని, నన్నుఁ గూర్చి మహాతపంబాచరించిన మహానీయులై నందరాని దివ్యపదంబున నిన్నునిల్పెదను.

బృంద—

సీ. అఖిలజీవుల్లను నీ ♦ వాడింపుచుందువు
తోలుబొమ్మలగతిఁ ♦ దోయజాక్ష
కనుకట్టు గట్టెదు ♦ గారడీకును బోలె
మిథ్యాప్రపంచమ ♦ మేయచరిత
జక్కులవాడవై ♦ జనుల వివేకంబు
బాపుచుండెదవు దై ♦ వతలలామ

సేమముల్ చేతువు ♦ బృందారకుల్ వేడ
బహువిధంబుల నీవు ♦ భవ్యతేజ

తే. గీ. మోహమూనెద వాకరిప్పె ♦ మోహమంద
జేతు వింకొకరిని కెట్లు ♦ జెలగుచుండు
నీ మహామహిమ దెలియ ♦ నీరజాన
నాదులకునైన శక్యమా ♦ హరి ముకుంద.

దేవా! నీయభీష్ట మధర్మమైనదని చెప్ప సాహసించినందులకు నన్ను మన్నింపుము. నేను పరమసాధ్విని. పతిపదాంబుజ సేవయే సతికి భూషణమని యెఱింగినదానను. ఒకరిని సంతోషింపఁజేయుటకుఁగాని లేక స్వార్థము నపేక్షించిగాని నేను సాధ్వినైయుండు దాననుగాను. పతిసేవ సతికి దైవచింతనకంటె నెక్కుడు మహిమ గలదని నేను గుర్తెఱింగితిని. అట్టిచో నేనధర్మకార్యమాచరించితినేని నాయాత్మ తిరుగ విముక్తి బొందుటకసాధ్యమగునంతటి ఘోరనరకమునఁబడ గలదు. నా సాధ్వీత్వముచే నిదివఱ కార్జించిన యశము మన్ను గలియును. సతికి బతివ్రతాత్వమే సర్వసంపదలనొసంగును. అదియే సర్వాభీష్ట ఫలప్రదము. అదియే సకలాఘ విమోచనము అదియే సజ్జన స్తవనీయము. అదియే సంతోషకారణము! వేయేల? అదియే మోక్షసామ్రాజ్యసౌధారోహణమునకు సోపానము. కావున నామనం బట్టి యధర్మోద్యోగమునఁ బ్రవేశపెట్టి లోకులు నన్ను నీచముగ జూచునట్లు జేయకుము. భగవంతా! నీపాదకమలములకు నమస్కరించు చున్నాను. నాయందుఁ గృపాంతరంగుఁడవై నీబుద్ధిని మరల్చుకొని, బృంద మహాసాధ్వియను యశోడిండిమము జగమున మ్రోగఁజేయుము.

విష్ణు—(తనలో) ఆహా! అమృతోపమానములగు నీమెవాక్యములు నాకెంతయు మోదము గొలుపుచున్నవికదా. సంపూర్తిగ నీమె
ఁగాని విడువరాదు. (ప్రకాశముగా) బృందా

నారాయణుండనగు నేను నిన్ను జేరియిట్లు వేడ, వలదని నిరాకరించుట నీకు ధర్మమా ?

మ. తరుణీ యేమి వచింతు నీకిపుడు సం ♦ తాపంబునుం గూర్చి యా
స్మరుఁ డుగ్రుండయి వేడి తూపులడరిం ♦ పం దచ్ఛితాస్త్రాళిఁ జె
చ్చెరఁ బాధింపఁగఁ నిట్లు వచ్చితిని రా ♦ జీవాక్షి నిన్వేడఁగాఁ
గరుణన్ జూపుము నన్ను, నీకును యశః ♦ కల్యాణముల్ జేకురున్

బృంద — మాధవా ! నా హృదయము నీకు విశదపరచితిని. ఇంకను నీయనవసర ప్రసంగముతో నేమిపని యున్నది. చతుర్దశభువన నాయకుండవగు నీకుఁ గూడ మదనావస్థయేనా మదనుండు నీ తనయుఁడే కదా?

విష్ణు — బృందా! మన్మథుఁడు తనయుండయిన నేమి వాడు తన వారిని బెరవారిని నొక్కరీతిగనే చూచుచు నీవిషయమున నాతఁడు నన్నుఁ దండ్రి నగుదుననియైన భావింపక బాధించుచున్నాడు. ఒక్క మదనుండే కాదు. నాకుటుంబమున నున్న వారందఱును నాకు విచారమును గూర్చువారే!

సీ. నా జ్యేష్ఠ పుత్రుండు ♦ నలు మొగంబుల వే
ల్పు శాశ్వత కార్యముల్ ♦ సలుపుచుండ
రెండవ పట్టిమా ♦ రుండు స్త్రీ పురుషుల
మోహ సాగరమున ♦ ముంచుచుండు
నిందిరాదేవి నా ♦ యిల్లాలు నిరతంబు
జంచల వృత్తిఁ జ ♦ రించుచుండు
భూమిదేవి ద్వితీయ ♦ పూబోఁడి యెప్పుడు
నిలచినచోటనే ♦ నిలిచియుండు

తే. గీ. వసతి రత్నాకరంబు, మేల్ ♦ పాన్పుపాము
వాహనము పన్నగవిరోధి ♦ భళిర నాదు
చిత్రసంసార కష్టముఁ ♦ జెప్పవశమె
తెలియకున్నదె నాకథ ♦ కలికిమిన్న

బృంద— దేవా! ప్రస్తుత విషయమును గూర్చిన సంగతి కాదుగాని, చెప్పుచుంటిని.

సీ. అవని దేవియె నీకు ♦ సతిగ భారకుఁడన్న
విమలయశంబును ♦ గొలువఁగలిగె
అల రమాదేవి నీ ♦ యాలియై భక్తమం
దారుఁడ నెడి బిరు ♦ దంబుఁ గూర్చె
భారతీరమణుండు ♦ పట్టియై గొప్ప సం
సారి యనఁబడెడి ♦ పేరు దెచ్చె
పరమపావని దివ్య ♦ వాహిని పుత్రియై
కలుషవాహనుఁడన్న ♦ ఘనత గొలిచె

తే. గీ. నిజము దలపోసి చూడంగ ♦ నీకు నీదు
పరిజనము దెచ్చు ఖ్యాతియే ♦ ధరణినిండె
నీవు దామోదరుండవు ♦ నిశ్చయముగ
తెలియవా నీదు చరితంబు ♦ జలరుహాక్ష

పంకజనాభ మహామునులకైనను దుర్లభంబగు నీదివ్యమంగళ విగ్రహ సందర్శనము నాపురాకృత భాగ్యంబున లభించినది. నేను విగతకల్మష నైతిని నీవు నాచిత్తమారయుటకో లేక యుద్దేశపూర్వకముగనో తెలిపిన నీయభిప్రాయమును మనంబునుండి బారదోలి, దాసురాల నగు నాగృహంబునకు నే డతిథివిగమ్ము నాశక్తి కొలది బూజించి కృతార్థురాలనగుదును.

విష్ణు—(తనలో) ఈరమణీమణి యెన్ని వాక్యములయిన బలుకుచున్నది. గాని నాయభీష్టమునకు మాత్రము సమ్మతింపకున్నది. ఈమె హృదయము నిష్కళంకమైనది. ఈమెకు నాయందున్న భక్తి వర్ణనాతీతము (ప్రకాశముగా) తరుణీ నేనడిగిన దొకటియు నీవు చెప్పునదొకటియుగ నున్నది. నాకేమి సరియైన ప్రత్యుత్తరమిచ్చెదవు. కాలహరణమునకు నాచిత్తమొకింతయు దాళదు.

మ. సరసీజాక్షిరో నాకు నీ విభుడు పూ • జల్ సేతు వన్నందుకే
బరమామోదముగల్గె; గాని వినుమా • భావోద్భవుం డేయు భీ
కర బాణంబులకోర్వలేక నినుఁగాం • క్షించేరి యాచించు శ్రీ
హరిసిన్ నన్ను నలంతిగాఁ దలఁచి యి • ట్లాడంగ నీకర్హమే.

బృందా! నీవు నన్నుఁ గరుణింపవేని విరహాగ్నిం బడి మగ్గుట నిశ్చయము. నేనిట్లయితినేని, సర్వజగత్క్షోభము గూడ సంభవించును. ఇందులకుఁ గారణము నీవే యగుదువు. కావున నన్ను గటాక్షించి కృతార్థురాల వగుము. నాకుఁ బ్రీతిసేయుట సర్వజగంబులకును బ్రీతిసేయుట యగును.

బృంద—ముకుందా! నీ వెంత చెప్పినను నాచిత్త మధర్మోద్యోగమున బ్రవేశింపదు. భువనశాసకుఁడ వయిన నీవిట్టి దుష్కార్యము సేయఁ దలంచుట యధర్మమగును.

సీ. అఖిల జగంబుల • నజునిచే సృష్టింప,
నొనరించు మహిమ యే • యూపు జేర
భూరి చతుర్దశ • భువన శాసనమహా,
దక్షత యేమూల • దాగియుండె
అశ్రాంత పరమ భ • క్తౌఘసంరక్షణా,
బిరుద మేమహానీయు • దరికిఁ జేరె
అమల భక్తముని గ • ణామర పూజితో
దార ప్రభావ మెం • దడఁగియుండె

తే. గీ. ఆదినారాయణాఖ్య యెం • దలరియుండె
విశ్వ సన్నుత గుణమెట • వెలుగుచుండె
వీని నెల్ల మఱచి యవి • వేకి కరణి
సాధ్వినగు నన్ను గోరుదే • జలజనాభ!

ముకుందా! మహోన్నతపదవి నధిష్ఠించి యుండినవాడ వగుటం జేసి నిన్ను జగములెల్ల భగవంతునిగాఁ గొల్చుచున్నవి. నేనును నీయందు నిర్మలమైన భక్తిఁ బూని వర్తించుచున్న దాననే ఇట్టి

యధర్మ కార్యమునందు నీవు ప్రవేశించితివేని, నీమహోన్నత పద
మునకు భంగము గలుగును. భర్తరక్షణకార్యము మఱచి, యిట్టి
యధర్మవర్తనోద్యోగమునఁ బ్రవేశింపఁ దలంచిన నీతో నీవిషయ
మగు ప్రశంస నేయఁజాలను గావున నేను గృహంబున కరిగెదను.
దేవా! నేనిట్లు బలికితినని యాగ్రహింపకుము. నీదివ్యనామస్మరణ
మాత్రము నాచిత్తమెప్పుడును నెడబాయదు. (పోఁబోవును)

విష్ణు—(తనలో) ఆహా! ఈమనిశ్చల హృదయ మెంతయుమతి కర్కశ
మైయున్నది. (ప్రకాశముగా) బృందా! బృందా! నీవునన్ను మోహ
సాగరమునముంచి యరిగెదవా?

చ. అరుగగ నెంచెదే జలజ ♦ హాక్షి రొ నన్నిటు ఘోరమోహసా
గరమున ముంచివేసి, త్రిజ ♦ గంబుల గొజ్జగునేను నిన్ను నీ
కరణిని వేడుచుండఁ గనఁ ♦ గా మదినెంచక యింతగా, నిరా
దరణవహింతువే? భగవ ♦ దార్చన యిట్టిదె? భక్తురాలికిన్

కుందరదనా! నేను నిర్గుణుండనయ్యు, గుణము గలిగిన వాడనై
ప్రకాశించుచుందును. నిర్మోహమున నుండినను సమస్త జగముల
మోహింపఁజేయుచుందును. రమణీ! నీచే నిరాకరింపఁబడి నే
నెట్లు మరలిపోవుదును! శ్రీహరి నగు నేను నీవిషయమున మనో
రథసిద్ధి నందకపోయినచో నాప్రభావమే మున్నదు?

బృంద—ఏమీ మాధవా? భగవంతుడవగు నీవు నీమహిమ పరదా
రల గూడు నిమిత్తమే వినియోగపఱుపఁ దలంచితివా? అక్కటా
ఎంతసాహసము! నీహృదయము జగంబెఱుంగలేక పోయెనుగదా!

సీ॥ తమకంబొనిన్నయు ♦ త్తముఁడని కాదెసు
రలు దైవముగ నిన్నుఁ ♦ గలిగినారు
సర్వేశుఁడనికాదె ♦ సకల భక్తసమితి
భూరి భక్తిని నిన్ను ♦ బొగడినారు

ఘనతైన పదవిని • గని కాదె తాపస
 శ్రేష్ఠులు నిష్ఠ బెద్ద • జేసినారు
అన్యాయుండని కాదె • యఖిల సవన కార్య
 ములయందు భోక్తగా • నిలిపినారు
తే. గీ, ఏనిచే గాదె త్రిభువన • విభుడనఁగ
 దుర్లభపదంబు చేతికి • దొరికె నీకు
 గాన నిలుపుకొనగజూడ • గౌరవంబు
 నిట్టి దుష్కార్యముల పొంత • జేరుదేని
 నిజపదచ్యుతిఁ బొందెదు • నీరజాక్ష

ఈ విధమున భాషించు నీయెదుట నేనింక నిలువనోప

(నిష్క్రమించును)

విష్ణు—బృందా ! బృందా ! అరుగుచుంటివా భగవంతుఁడనగు నా యెడల నింత నిరాదరణమా (తనలో) ఈమె సౌశీల్య పాతివ్రత్యము లద్వితీయములై యున్నవి నెన్నడిగా నీవిషయమై యోచించెదఁగాక (నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.



# సతీతులసి

## తృతీయాంకము



రంగము:—[గాలవాశ్రమము ముందు జలంధరుడు—ప్రవేశము.]

జలం.—(కలలో) గాలవుని సతియగు చారుమతి సౌందర్యవంతులం దెన్నికఁగన్న కాంతయని వినియుంటినేగాని, యెన్నడును వీక్షించి యుండలేదు ఇప్పుడు నే నెట్లయిన యీ ముని యాశ్రమంబును బ్రవేశించి యాకాంత నరయవలయును. నా యుద్యమమున కనుకూలముగ గాలవు డాశ్రమమున లేక యున్నచో నాభాగ్యము పండినట్లే. (ఎదుటఁజూచి) ఎవ్వరో సుదతీమణి యిట్లువచ్చుచున్నది. ఎవ్వరైన యుండును చారుమతియేయై యుండును. (పరికించి) నా యనుచరులు చెప్పిన మాటలఁబట్టి జూడగా నీమెయే చారుమతిఁ యగునని తోఁచుచున్నది.

(తెరలో)

అమ్మా చారుమతీ భగవదారాధనకుఁ బుష్పముల దెచ్చుటకు నీవుకూడ వచ్చెదవా? (ఇంచుక యూరకుండి) ఏమనుచున్నావు నాథు డాశ్రమమున లేడు గావున నీవు పోయిరమ్మనియా! సరే నేను పోయివచ్చెదను.

కలిం—(విని నవ్వుచు) ఆమెయే చూపరుతి. ఈమె వాక్యములం బట్టి చూడఁగా గాలవుఁ డాశ్రమమున లేఁడని తోఁచుచున్నది. నాయుద్యమమునకీ సమయ మెంతయు దగియున్నది. భూపాలుఁడనగు నే నాశ్రమమునఁ బ్రవేశించుట కేవిధమయిన యభ్యంతరమును నుండదు కదా? (పరికించి) ఈమె సౌందర్య మద్వితీయమైయున్నది మునిపత్నుల కిట్టి సౌందర్య ముండునాయని సంశయించితిని గాని యీమెను జూడఁగానే సందేహము వాసినది.

శా. ఔరా కన్నులతీరు, చక్కఁదనమా ♦ హా! మోముచంద్రంబు న
య్యారే నీలములన్ హసించు కురులో ♦ హో హా, మిటారంబు, మ
జ్ఝారే చన్గవయద్దిరా తను విలా ♦ సస్ఫూర్తి వహ్వారె యీ
నారీరత్నము బోలు సుందరిని గా ♦ నఁ జాల లోకంబులన్

తే. గీ. కొమ్మ గాదది ముద్దుల ♦ నమ్మగాని
కలికిగాదది మదనుచే ♦ చిలుకగాని
కాంత గాదది రతినాల ♦ బంతిగాని
భామ గాదది సౌందర్య ♦ సీమగాని

ఈ తరుణీ శిరోమణి వాలుచూపుల, జూచెనేని. మదనుండే తన విలునమ్ములు నేలఁబడవైచి యీమెకు దాసుఁడు గాకయుండునా ఈతలోకరిని వీక్షించినంతనే. యీ యనంగుఁడు తన పుష్పశరంబుల నాపై బఱపనాగినాఁడు కానిమ్ము నే నీ యజ్ఞాత్మం జేరి మదీయ మనోరథంబెఱింగించి కృతార్థుఁడనై యీ కాముని గర్వమడంచెదఁగాక (కొంచెము నడచిచూచి) అదిగో ఆమె బిందెనైగొని జలార్థమై కాబోలు నదికరుగఁ దలంచుచున్నది భళిరా ఈమె సౌందర్య మిప్పుడు సంపూర్తిగ గానిపించుచున్నది

ఉ. కన్నులకబ్బుదీర సిత ♦ కంజదళంబుల మంజువైఖరిన్
గన్నుల జందిపారము ము ♦ ఖంబున బింబప్రుడంబు వాతెఱన్
బన్నగరీతి కీల్జడను ♦ వల్లులసౌరు శరీరశోభలన్
గొన్న నగుత్తులన్నెలకుఁ ♦ గొన్నవిలాసముచేత చన్గవన్

దిన్నవి దివ్యచంపకము ♦ తీరునఁ దేరగు నాసికంబు నం
దెన్నఁగరాని సొంపుఁగల ♦ కింపురుషాంగములన్ వహించి రా
జన్నగధాళధళ్యమును ♦ సన్న మొగంబుచు విప్పగుచ్ఛముల్
బన్నినపావడంబులుగు ♦ బయ్యెద గుత్తపుఁగైకకప్పులం
టన్నరయించి మధ్యనిక ♦ టంబునఁగాంచి ధరించి మంచిరా
కన్నులదీపిమించ కర ♦ కంకణముల్ వచరించి భద్రముల్
నెన్నఁడఁగింకిణీరవపి ♦ నిర్మల శైలినతిక్రమించి, చం
చన్నితరానలోకన ర ♦ సభ్రమచే వారిణిన్వసించి. య
య్యన్నులమిన్న బిందెగొని ♦ యానదికేగెదు నీరుదేరఁగన్.

(పరీక్షించి) లేదు. లేదు మరల నేకారణముచేతనో బిందె నక్కడ బెట్టి యీమె యిటువచ్చుచున్నది నేను నెమ్మదిగా నీమె కంట-బడెదఁగాక (ఇంచుక ముందునకుఁ బోవును)

(చారుమతి - ప్రవేశించును.)

చారు—(తనలో) పుష్పములకొఱ కరిగినమైత్రేయి యింకను రాలేదేమి కారణమో

(జలంధరుఁడు - చారుమతి చూచునట్లు ముందునకువచ్చును)

చారు—(జలంధరునిఁజూచి యించుక వెనుక కేగి తనలో) ఓహో! ఈతఁడు జలంధరుఁడు ఇప్పు డీతఁడియ్యెడ కరుదెంచుట కేమి కారణమోకదా?

జలం—(చారుమతిని సమీపించగా నామె వెనుక కేగుటఁజూచి) తాపసపత్నీ నన్నుఁజూచి నీవు భయమందెద వేల నేను పెరవాడను గాను. జలంధరుఁడ. మునీంద్రుఁడాశ్రమమున నున్నవాఁడే?

చారు—(తనలో) మునిపత్నినగు నేనీతనితో మాటలాడిన నందువలన నేమిదోషము సంభవించును (ప్రకాశముగా) స్వాములవా రాశ్ర

షమునలేరు. సమిత్కుశఫలాహరణార్థమై యరిగినారు. ఇప్పుడే యరుదెంచి భూపాలుండవగు నిన్నుందగిన విధంబున గౌరవింతురు. అంతవఱకును నాశ్రమమున విశ్రమించి యుండుము.

జల—(తనలో) ఆహా! ఈయువతిమణి మృదుమధుర భాషణములు నా కెంతయు సంతసము గొలుపుచున్నవి. నేను నెమ్మదిగా నాయభిప్రాయ మెఱింగించితి నేని, యీమె తప్పక సమ్మతించునని యాలోచు చున్నది. (ప్రకాశముగా) యోషామణీ! నీయాదరణంబునకు నేనెంతయు సంతసించితిని. కాని యొక విషయమున మాత్రము నిన్నుం జూచిన నాకు మిగుల విచారము గలుగుచున్నది.

చారు—రాజేంద్రా! నీవు నన్నుం జూచి విచారింపవలదు ఒక వేళ మేము తాపసులముగదా నిన్నుం బూజింపలేమని నీవనుమాన మొందం బనిలేదు తపోగరిష్ఠుండగు మన్నాథుం డేతెంచి, భవత్పరివారంబునకును, నీకును గూడ విందు లిడంగలండు.

జలం—

ఉ. విందులొసంగనేల, యర ♦ విందదళేక్షణ నాకు మీరలా
నందము మీఱ నిప్పుడు మ ♦ నంబున సంశయమెల్ల వీడినే
నిం దరుదెంచు కారణము ♦ నింపుగఁ జెప్పెదనీకు, దాని, నీ
వుందగ నాలకించి కృప ♦ బ్రోచెదవో మఱిబ్రోవకుందువో.

మ. సురనారీమణులన్ భుజంగసతులన్ ♦ క్షోణీశశుద్ధాంత సుం
దరులన్ గారుడవంశకన్యకల, గం ♦ ధర్వాంగన శ్రేష్ఠలన్
జర మోదంబున గంటిగాని, విను మీ ♦ క్షింపంగలేదెందు, నీ
సరియౌ కాంతను, నిశ్చయం బిదిసుమా ♦ శీతాంశు బింబాననా.

చారు—(తనలో) ఈతం డవసరములేని ప్రసంగములోనికి దిగుచున్నాడు. ఈతని గుణములను గూర్చి మున్నొకసారినేను విని యున్నాను. అయినను భూపాలుండుగదా! ఆశ్రమమునకు వచ్చినప్పుడు గౌరవించకపోవుట యుక్తముగాదని భాషించితిని.

జలం—రమణీశిరోమణీ! త్రిజగంబులను సమ్మోహసాగరంబున ముంచ జాలిన సౌందర్యము గల నీవొక బడుగు దాపసిని గైకొని కష్టములనుభవించుచుంటివి కదా! నీ సౌందర్యమును గూర్చి నాచారుల వలన నింతకు మున్నే నేకసారులు వినియుండి, యెవడేని నిన్నొంటిగఁజూచి సంభాషించు భాగ్యములు గలుగ కుండునా యని వేచి యుంటిని. అయ్యది నేటికి లభించినది. ఆలస్యము చేసినచో మోస మగును గావున నొక్క మాటలోఁ జెప్పెదను.

మ. వనజాక్షీ నిను జూడగానె వినుమా ♦ పంతంబునుఁ బూని చం
డనిశాతాస్త్ర పరంపరల్ తనువు నిం ♦ డఁ జాలగీలించి నె
ట్టన హంసాది ఖగార్భటుల్ జొనిపి వే ♦ డ్కన్ మన్మథుండుండె, నీ
వనుమానింపక నన్నుఁ జేకొని భ ♦ వ్యశ్రీలతోఁ దూగుమా.
రమ్మా నీభర్త రాకమును పే నాపురంబునకుఁ బోవుదము.

చారు—(తనలో) అక్కటా! యీనృపాలునకు నన్నుఁ జూడగనే యెట్టి దుర్బుద్ధి పుట్టినది. ఇప్పుడు నేనేమి సేయుదును? మునికన్యకలు గాని, సాధుడుగాని యాశ్రమమున లేరు. కానిమ్ము నేనితనికి సామవాక్యములఁ బలికి హృదయమును నా దురుద్యోగమునుండి మరలించెదఁగాక! ఈలోపుగా తాపసకన్యకలు గాని సాధుడుగాని రాక యుందురా? (ప్రకాశముగా) రాజేంద్రా! నీవు నృపాలుండ వనుటచే గౌరవించక పోవుట యుక్తముగాదని తలంచి సంభాషించి నందుకు మాకుఁ గలుగు ఫలమిదియా?

ఉ. పాలన శీలముల్ వినుల ♦ భావము గిప్పుడ భూతలంబునుం
బాలనసేయు భూపతుల ♦ భంగులెఱింగియు నిట్టిరీతి దు
శ్శీలుఁడవై పరాంగనలఁ ♦ జేరగ నెంతువె, ధర్మమౌనె, లో
కాళి హసింపవే నిను ధ ♦ రాధిప! బుద్ధి మరల్పుమా వెనన్.

జలం—అన్నులమిన్నా! ప్రపంచమున నేనొకరిని లక్ష్యపెట్టువాడను గాను. నా చిత్తము నీయందుఁ జిక్కినది. నా యభీష్టము నీకెఱింగిం

చితినేని నీవు తప్పక యంగీకరింతువని తలంచివచ్చితిని. (ఎదుటఁ జూపుచు)

తే॥ గీ॥ అదిగొ పరివార మున్నది • యచట; రథము
నదిగొ యెక్కుమా యిక సంశ • యంబు విడిచి
మత్పురంబును జేర్తు; నా • మగువ వగుచు
సౌఖ్యములఁ బొందెదవుగాక • జలజనయన.

చారు—(తనలో) ఆశ్రమమున నానాథుఁడు లేని సంగతి నెఱింగియే యీతఁడు నాయెడల ద్రోహబుద్ధినిఁ బూనివచ్చినాడు. హా! పరమేశ్వరా! నన్నీ దురాత్మునిబారినుండి రక్షింపుము. (ఇంచుక యూరకుండి) దుష్టచిత్తుఁడగు నీతఁడు నే నేమి చెప్పినను వినఁడు. వీనితోఁ గొంతవఱకుఁ గాలయాపనము సేయుచునుంటినేని యింతలో నా చెలికత్తెగాని నాథుఁడుగాని వచ్చును. (ప్రకాశముగా) జలంధరా! నీ వీశ్వరుని నయనంబుల నుండి వెలువడిన కోపజ్వాల వలన జనించితివి - నీకుఁ దెలియని పరమధర్మము లెందును లేవు.

మ. చతురంభోధి పరీతభూవలయగా • జన్యాన్యయోత్తంస సం
తతి సేవింపఁగఁ జక్రవర్తివయి ప • న్నగ్రానవీత్యా కృశీ
కృతగాత్రిన్ మునిపత్నినీగతి ధృతి • శ్రీహీన చిత్తుండవై
సతిగాఁగమ్మని కోరుచుంటి వకటా • శ్లాఘింతురే నిన్ జనుల్.

మ. క్షితిలో లేరె సతీమణుల్ నవవయ • శ్శ్రీరూపలావణ్యజృం
భిత లోభూవర, నీకుఁ గోరఁగఁదలం • పేయున్న; నీవట్టిచో
వ్రతనై నారలు గట్టి తాపసకుటీ • రక్షోణి నుంచిట్లు సం
తతమున్ భర్తను గొల్చుచున్ దనరుఁ • గామించుటల్ ధర్మమే

జలం—రమణీ! కాముకులకు యుక్తాయుక్త విచారణముండదు. (ఇంచుక యూరకుండి) ఇంక నేను కాలహరణమునకు దాళఁజాలను (సమీపించుచున్నాఁడు)

చారు—(తనలో) ఈతఁడంతకంతకు మీఁదకు వచ్చుచున్నాఁడు. ఇచ్చట వీనిదుష్కృత్యమును వారించు వారెవ్వరును లేరు. (ప్రకాశముగా) భూపాలా! ఇదినీకు ధర్మముగాదు. నేను తాపసపత్నిని. సాధ్విని. పరాంగనారతము పాపమని యెఱింగియు నట్టి దురుద్యోగమునఁ బ్రవేశించుట నీకీర్తినిఁ బ్రాణములకుఁగూడ హానిసంభవించును. నామాటవిని నన్ను నీసోదరిగ భావించి వచ్చిన దారినిఁ బొమ్ము. ఇట్టి దుర్వృత్తిం బ్రవేశించి, సాధ్వీమణుల నోటినుండి వెలువడు శాపాతుర మహాగ్ని జ్వాలల కాహుతుఁడవు గాకుము.

జలం—తరుణీ! నన్నీరీతి భయపెట్టఁ జూడకుము. కామించి వచ్చిన నన్ను నీయంతట నీవాదరింతువేమోయని యింతవఱకును గాల హరణమున నోర్చితిని. ఇఁక నేనోర్వఁజాల నేనే నిన్ను బలవంతముగ రథముపైఁ బెట్టుకొని కొనిపోయెద (పట్టుకొనఁ బోవును)

చారు—(కోపముతో) ఔరా! ఏమి! నీసాహసము తాపసపత్ని నగు నన్ను బలవంతమునఁ గొనిపోయెదవురా! నీకు వినాశ కాలము సమీపించినది (నాథుని నుద్దేశించి) హా! నాథా! దుశ్శీలుఁడగు జలంధరుఁడు బలవంతమున నన్నుఁగొనిపోవ దలంచుచున్నాఁడు. సత్వరముగవచ్చి నన్నురక్షింపుము హా! మైత్రేయా! ఈసమయమున నీవైననున్నచో నీ దురాత్ముఁడిచ్చటకు రాకయుండునుగదా,

[ తెరలో ]

ఎవ్వఁడాదురాత్ముఁడు! ఇదిగో వచ్చుచున్నాను

జలం—(ఎదుటఁజూచి) అక్కటా! కార్యమునకు భంగమైనది. అదిగో గాలవుఁడే వచ్చుచున్నాఁడు. ఇఁక నేనిచ్చట నిలచియుండరాదు. మఱియొక సమయమున నీమెనెట్లయినఁ గొనిపోయెదగాక.

(తొందరగాఁ బోవును)

చారు—(తనలో) అమ్మా! గండము గడచినది. ఈ నీచాత్ముఁడు నాథుఁడు వచ్చుచుండుటఁ జూచి యీ ప్రదేశము విడిచినాడు. లేనిచో నాకెట్టిహాని సంభవించి యుండునోకదా!

గాలవుఁడు—(ప్రవేశించి) ఎవ్వఁడా దురాత్ముఁడు!

చారు—నాథా! వచ్చితివా! ఈసమయమున నీవు రానియెడల నేనెట్టి యాపదను బొందియుందునో కదా!

గాల—అదియేమి?

చారు—జలంధరుఁడు...

గాల—ఈదురాత్ముఁడు నేఁడు మన యాశ్రమమునకు వచ్చెనా యేమి పరనారీ హరణమాపనుండగు వానికి నీకెట్టి హానియుఁ జేసియుండ లేదుకదా!

చారు—నీరాక యా హానిని దప్పించినది. అతఁడాశ్రమమునకు వచ్చి యనినమాట లన్నియు నావకాశముగఁ జెప్పెదను

గాల—వానికి వినాశకాలము సమీపించినది. రమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము?—(2)?-(జలంధరుని మందిరము:-ప్రవేశము జలంధరుఁడు)

జలం—(తనలో)

మ. అకటా! యేమియొనర్చువాఁడ నిపుడ ♦ యవ్యాజ్యాతపతాశ్రితి చే
తికిఁ జేకూరియుఁ దప్పిపోవుటను రా ♦ జీవాక్షి పుత్రుండు, మా
మక ధైర్యం బెడలింపసాగెను నికం ♦ బద్మాక్షి నెబ్భంగిఁ జే
తికి లభ్యంబగు నట్లు జేసి మదనో ♦ ద్రేకంబు వారించెదన్?

ఆనాఁడు గాలవుఁ డాసమయమునకు రాకయున్నచోఁ జారు మతిని నా గృహమునకుఁ జేర్చియే యుందును. (ఇంచుక యూరకుండి) మించిన దాని కిప్పుడు యోచించినందునవలనఁ బ్రయోజన మేమియున్నది? ఎట్లయినను సమయము వేచియుండి, చారుమతిని బంధించుకొని రమ్మని భటుల కాజ్ఞాపించితినిగదా!

[బృంద - ప్రవేశించును].

బృంద—(జలంధరుని సమీపించి) ప్రాణేశ్వరా! నేడింత దీర్ఘాలోచన తత్పరుఁడవై యుంటివేమి? కారణ మెఱుఁగ దగునా?

జలం—ప్రతివిషయమునందును జోక్యము గలిగించుకొనవలదని యెన్ని సారులు చెప్పినను నీవేల వినవు?

బృంద—నాథా! ఆగ్రహింపవలదు. రాజకార్య వ్యవహారగ్రస్తమైనదో నే నా తెరవునకు బోను. కాని, నీచిత్త మింతరాలోచన యందు మగ్నమై యున్నదని తెలియుచున్నది.

జలం—మనస్సులోపల యూహాకాండఁ గనిపెట్టఁ దగినంత సమర్థురాలవు.

బృంద—నీచింత పరనారీహరణంబును గూర్చి కాకున్నచో నాకు బెంగ యుండదు.

జలం—అదియైన మాత్రము నీ కేల బెంగ?

బృంద—పరనారీహరణము పాపమునకు మూలమని,

జలం—నీకు దెలిసిన మాత్రము ధర్మములు నాకుఁ దెలియవా?

బృంద—ఆర్యపుత్రా! నేనట్లుఁ జెప్పుటకు సాహసింపఁగలనా? సర్వ మెఱింగియుండియు నేనే కారణముచేతనో నాకుఁ జింతఁ గూర్చుచుంటివి.

జలం—నేనేమి నీకుఁ జింతఁ గూర్చితిని?

బృంద—

సీ. మనసార నీపాద • ఘనసేవఁ గావించు,
నెన్నఁడైనను నాకు • నిచ్చినావె
ముదమార నెపుడైన • మృదుమధురవచో
సరణి నాకును జూపఁ • జాలినావె

నీవె దైవంబుగా ♦ నెంచియుండిన నాకు
ప్రేమ యొక్కింత, చూ ♦ పించినావె
యగ్నిసాక్షిగఁ గొన్న ♦ యతివ యడచుచును నన్ను
గాసంత కరుణతోఁ ♦ గాంచినావె
తే. గీ. యకట! నీకు సద్ధర్మిణినై ♦ యలరునాకు
తాపమునుగూర్చ నీకుఁ ♦ ధర్మమగునె
నీకుఁ దెలియవె ధర్మంబు ♦ లోకమందు
గలదె నీకు నేవదియుఁ ♦ గలనె నాథ.

జలం—ఇష్టములేని వివాహమును సౌఖ్యమును తాకరమునాడని నేను మొలుతనే తలంచితిని.

తే. గీ. అల స్వయంవర సమయంబు ♦ నందు సతివ
నాగళంబున హారముఁ ♦ వైవఁబోయి
క్రిందఁ బడవేసినప్పుడే ♦ కాంక్షగడన
భూరివైరాగ్య మొందితిఁ ♦ బ్రాక్తముగను.

బృంద—నావలన గలిగిన యానేరమునకా నీవిట్లు నన్ను నిరాదరించుట !

జలం—రమణీ! అప్పుడు నేను వివాహ మక్కఱలేనిదనియే పలికితిని కాని, యానారదుండు నన్ను వంత పఱచుటచేత నిన్ను మెడకు గట్టుకొంటిని.

తే. గీ. గంగిరెద్దుకు మెడలోన ♦ గంతయట్లు
గట్టుకొంటిని నిను నేను ♦ కాంతనున్న
యిప్పుడేమి చింతించిన ♦ నేమి ఫలము
ననుభవింపంగ వలయును ♦ నళినిపాణి.

బృంద—ప్రాణేశ్వరా! నామూలమున నీకు గలిగిన విచారమేమి? యున్నది పరదారాగమనంబు వలదనియు తాపసుల బాధించుట తగదనియు జెప్పుటయేకదా నావంకదోషము! నీశ్రేయమును నేనుగాక మరెవ్వరు గోరుదురు?

సీ. పరసతీ మణులపై ♦ భ్రాంతిని వీడుమా
యంచు వచించనా ♦ లించినావె
మునిపుంగవుల స్త్రీచేఁ ♦ బోవలదంచును.
జెప్పుమాటను జెవిఁ ♦ జేర్చినావె
అమర సంతతిఁగాంచి ♦ హాసియింప దగదంచు,
నెంతచెప్పిన గుర్తు ♦ నెఱిఁగినావె
ధర్మమే జయమను ♦ తాత్పర్యమును బూను,
మని చెప్పు నానుడి ♦ వరసినావె

తే. గీ. యిట్టివన్నియు వచియించి ♦ యొసఁగుకతన
నీకునాపై సమూయ జ ♦ నించెఁగాదె
గాకయుండిన నాయందు ♦ గలిగినట్టి
దోషమేమి నీకును దోచ ♦ దో నిజేశ

మనోహరా! ఎంత భాగ్యముండిననేమి ఎట్టిభోగములుండిననేమి ఘోర విపదాంబుధిఁ దరించుటకు నావయు సంతాపదావాగ్ని ఘనవృష్టియు, బాపారణ్యమునకు నాలవిత్రింబును, మోక్ష సంధానకర్తయునగు పతిసేవకు దూరమైన సతి బ్రతుకేల?

( తెరలో )

ఈదురాత్ముల బారినుండి నన్ను రక్షించు పుణ్యాత్ములులేరా?

బృంద—(ఆలించి స్త్రీయార్తరవము వలెనున్నదే.

చారు—(జలంధరుని నుద్దేశించి) హా! వరపాలా! ఎంతదుష్కార్యము జేయించితివి ఇట్టిదుష్కార్యమునందు వర్తించుచున్న నినుఁగాలుడింకను గొనిపోవక యుండెనేమి? పతివ్రతా శిరోమణుల నీవిధంబున జేయుట కేనానీవుజన్మించినది.

బృంద—(తనలో) పాపము ఈమెయెవగో సాధ్వి. నాథుని దురంత కృత్యములకు మేరలేకుండెనుగదా! (ప్రకాశముగా) ప్రాణేశ్వరా ఈమెయెవరు?

జలం—ఎవరా! అన్ని విషయములు నీకే కావలయును. గాలవుని భార్య

బృంద—అక్కటా! ఎంత ఘోరము ఎంత ఘోరము! తాపసి పత్ని యగు నీమె యెడల నిట్టి కృత్యము సేయ సాహసించుట ధర్మమా?

చారు—(బృందను జూచి) అమ్మా! బృందా! నీవును నాడదానవుగదా నీభర్త మొన్న మాయాశ్రమమునకువచ్చి నన్నెన్నో మాటలాడి తుదకీరోజున నిట్లు జేయించినాడు. ఈతఁడెప్పుడో సాధ్వీమణుల శాపముచేతనే యంతమందును.

బృంద—(జలంధరుని జూచి)

చ. పరసతులెల్ల దల్లులని ♦ భావములోఁ దలపోతమూని, యా
పరమపతివ్రతామణి, స ♦ హాయగుణాకర నిట్టి భంగినిన్
బరిభవముస్ బొనర్చుటది ♦ భావ్యమె, శ్రేయమె, చాలునింక, నీ
తరుణిని దల్లిగాఁగనుచుఁ ♦ దాపసి సన్నిధిఁ జేర్చగాదగున్.

ఇట్టి కార్యములే, గౌరవనాశనమునకు, బ్రాహ్మణహానికిని గారణములగును.

చారు—(బృందనుజూచి) తల్లీ! అట్లుజెప్పి నన్ను రక్షింపుము.

జలం—(బృందనుజూచి)

మ॥ అలినీలాలక యిట్టి కార్యముల చా ♦ యన్ జేరి యిబ్భంగినిన్
బలుకం జెల్లునె నీకు, నిర్భయత; నీ ♦ పద్మాక్షిపై నాకు న
త్యలమోహం బొదవంగ దెచ్చితిని, నె ♦ వ్వాడైన వారింపఁగా
దలఁపున్ బూని చరించునే, మదిని వం ♦ తంగుందనీ కేటికిన్.

బృంద—నాథా! ఆగ్రహింపకుము. సాధ్వీమణుల నీవిధంబు సేయుట తగదని చెప్పుటకు సాహసించుచుంటిని. నాకు, నీపదాంబుజసేవ యొసంగలేదని యైనను చింతింపనుగాని, యిట్టియకార్యము నాయెదుటజరుగుచుండ నేను సహింపఁగలనా? తుదకీకార్యములు బలవంతముగ నాప్రాణముదీయును. ప్రాణేశ్వరా! ఏమో పలికితి నని తలంపక, యీమానును విడిచిపుచ్చుఁడు. (చారుమతిని సమీపించి)

తల్లీ! నీవు చింతింపకుము. నా నాథుఁడొనర్చిన యపరాధమును సైపుము. నిన్ను మీ యాశ్రమమునకు సుఖముగాఁ జేర్పించెదను. రమ్మా. (చారుమతిఁదీసుకొని లోనికిఁబోవును)

జలం—(తనలో) గాలవుఁడు వచ్చుటచేతనీ చారుమతియుపద్రవముఁదప్పించు కొనినది. ఇప్పుడు బృందయడ్డుపడినది. ఈభటుఁ డీమెయు బృందయె యగునట్లు దెచ్చుటచే నిట్లయినది.

సేవ—(ప్రవేశించి) మహారాజా! నారదమునీంద్రుఁడువచ్చి యున్నాఁడు.

జలం—(తనలో) ఈసమయంబున నీతఁడేల యరుదెంచెనో కదా! (ప్రకాశముగా) మునీంద్రునకు కభ్యంతర మేమున్నది? శీఘ్రముగా లోనికిఁ బ్రవేశ పెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి వెంటనే నారదునితోఁ బ్రవేశించును).

నార—(తనలో) ఈ జలంధరుని దుష్కృత్యము లంతకంతకు హెచ్చు చున్నవి. తక్కిన విషయము లెట్లున్నను, బరదారాగమనము అందులో మునిపత్నులను భంగ మొనరింప దలంచుట యెంతయు ఘోరముగ నున్నది. కానిమ్ము, ఈతని దుష్కృత్యమునకు నేను దోడ్పడ శంకరునితోఁ గయ్యము సంభవించునట్లుఁ జేసెదను. దానం జేసి కలహాభోక్తనగు నాకు సంతోష మొదవుట మేగాక, త్వరలోన దుర్మార్గుఁ డణఁగుటకూడ సంభవించును.

జలం—(ఆసనమునుండి లేచి) మునీంద్రా! వందనములు. ఈపీఠంబు నలంకరింపుము.

నార—(ఆసీనుఁడై) జలంధరా! నీకుఁ గుశలమే కదా?

జలం—మునీంద్రా! మీ కటాక్షమునఁ గుశలముగనే యుంటిని. (ఇంచుక యూరకుండి) మహాత్మా! మీ రాకచే నేను ధన్యుఁడనైతిని. ఇప్పుడు నెచ్చటికిఁ బోవుచు నిచ్చటి కరుదెంచితివో యానతిచ్చెదవా!

నార—నేనిప్పుడు కైలాసమునుండి వచ్చితిని.

జలం—కైలాసమున విశేషము లేమి ?

నారద—నేనక్కడ కరిగిన సమయమునఁ బరమేశ్వరుఁడు లేడు. గంగా పార్వతులే కారణమునకో కలహించుచుండిరి.

జలం—పరమేశ్వరుని జీవితకాలమంతయు నా సవతుల కయ్యము వారించుటకే సరిపోవుచున్నది. ఇంతకును కలహకారణ మేమో నీకుఁ దెలిసెనా ?

నారద—కలహకారణమే మోనాకును దెలియలేదుగాని పర్యవసానము మాత్రము దెలిసినది. గంగ పార్వతికి నీవొకనిచే బట్టుబడుదువుగాక యని శపించినది.

జలం—మునీంద్రా! తాను మహాసాధ్వినని యా పార్వతికి మిగులగర్వమున్నది.

నారద—ఈసంగతి నీవుగూడ గ్రహించితివికదా! ఆమె కొకసారి గర్వభంగము కావలెను. (ఇంచుకయూరకుండి) జలంధరా !

తే॥గీ॥ అరయఁ బచ్చికప్పిన ప్ర ♦ హ్లాదమన్న
పగిది, మానవుల భార్యలఁ ♦ బల్మిబట్ట
వలచుచుండెడి పడియేటి ♦ దర్పగుణము
బలముగల్గిన నా "సతిఁ" ♦ బట్టునయ్య

ఇట్టికార్యము నీవు చేయఁజాలితివేని నీయశము చతుర్దశభువనంబుల యందును నిండును.

జలం—తాపసోత్తమా! ఈసంగతి మంచిసమయమునందే దెచ్చితివి. నేనిప్పుడు పార్వతిని బట్టితినేని యామెకు గర్వభంగమగుటయేగాక గంగ యిచ్చినశాపము గూడ నిజమగును.

నారద—జలంధరా! మాటలనలనఁ బ్రయోజనము లేదు.

జలం—నారదా ! నేను [illegible].

ఉ॥ ఏనిదె యేగి యోసతిని • నింపు దలిర్పఁగఁ బట్టితెత్తు; శ్రీ
జానియు భారతీపతియు • శంకరుఁడున్ మఱి దేవబృందమున్
బూని రణంబుఁజేసినను • బూర్ణపరాక్రమశౌర్యవృత్తినిం
గానఁగఁజేసి యోర్చెద ఙ • గంబునఁ బ్రోకఁగ మద్యశోలతల్

ఇప్పుడీమాటలతో నేమిపనియున్నది ? పార్వతినిఁ బట్టితెచ్చి నప్పుడు నీకే చూచెదవుగాక !

నార — నీవు తలంచుకొన్న చో నెంతటిపనియైనఁ జేయఁగలవు. కాని శంకరుఁడు లేని సమయముఁజూచి యాకార్యము జేయుము. ఈ విషయమై నేను బ్రేరేచితినని యెక్కడను జెప్పవలదు. ఈసంగతి యతిరహస్యముగా నుంచుము. నేను పోయివచ్చెదను.

జలం — మునీంద్రా ! వందనములు.

నార — (ఈవలకువచ్చి) ఈయుద్యమమున నీతఁడు ప్రవేశించెనేని రుద్రుని కోపానలజ్వాలలకు భస్మమగుట నిశ్చయము. అట్లుగాక, బృంద మంగళసూత్రమహిమంబున నీతఁడు బ్రదికెనేని యప్పుడింకొకమార్గము జూడవచ్చును. (నిష్క్రమించును)

బృంద — (ప్రవేశించి) నాథా! నారదుండు కాబోలిప్పుడు వచ్చినాడు.

జలం — అవును (ఇంచుకయూరకుండి) చాయమతినిఁ బంపివేసితివా !

బృంద — ఇరువురు సేవకులను, నొకచెలికత్తెను నామెకుఁ దోడిచ్చి, గాలవుని క్షమావణ కోరుకొమ్మని చెప్పివంపితిని. నాథా ! ఇంక నీ వెప్పుడును నిట్టి యకార్యము లాచరించ వలదని నాప్రార్థన.

జలం — నేనొనర్చుచుండు నిట్టి కార్యములన్నిటికిని నీవు విఘాతము గలిగించుచుంటివి.

బృంద — నాథా. నాబ్రతుకు నీకష్టమునఁ గున్న చో భవదీయహస్తాలంకృత కృపాణముతో నాకంఠమును దెగవేసిసుఖింపుము. అంతియెగాని యిట్టి యకార్యముకు నేను సమ్మతింపను.

జలం—(కోపముతో) సరే, ఇప్పుడీచర్చ యెందుకు? నేనిప్పుడు కైలాసమున కరుగవలయును.

బృంద—పరమేశ్వరుని సందర్శించుటకా?

జలం—కాదు కాదు, మహాసాధ్వియని చెప్పుకొనుచుండు పార్వతికి గర్భభంగ మొనర్చుటకు.

బృంద—(తొందరతో) ఆ! ఏమిది! పార్వతికి గర్భభంగమా!

జలం—అవును. అందుకు సందియమేమున్నది?

మ. అమరుల్ భీతిల, సిద్ధయక్షగణ మా ◆ హాకారముల్సేయ, శ్రీ
రమణుండున్ హరుడున్ విధాతయును సం ◆ గ్రామంబునన్నిల్చి మ
ద్రమశౌర్యంబును జూసినన్ విమువకే ◆ రాజద్బలాటోపతన్
గమనీశౌరాజ్వల దేహ నాపతిని వే ◆ డ్కన్ బట్టి తోద్రెచ్చెదన్.

బృంద—(భయము నటించి) హా! నాథా! ఈబుద్ధి నీకేపుట్టెనా? ఎవ్వరైన బోధించిరా? లోకమాతయగు పార్వతియేడ! నీవేడ! ఆమెకు గర్భభంగమొనర్చుటేడ! ఇట్టి యకార్యముసేయుట యాత్మనాశనమునకుగాదా! నాథా! ఇందుకు నేనేమని వగతును?

తే. గీ. శక్తిరూపిణి యైన యా ◆ సాధ్విఁజేర
నెంచు టదిచూడఁ ఫలమంచు ◆ నెంచి మొగసి
యగ్నిఁబడెడి మిడుత చందఁ ◆ మగుగాదె
వలదు నీకిట్టి కార్యంబు ◆ వలదు వలదు

తే. గీ. నీదు జన్మకు మూలమౌ ◆ నీళగళుని
దేవి యైనట్టి సతిని బం ◆ ధింపఁదలచు
టెంత దుష్కార్యమో మతి ◆ నెంచినావె
తల్లి కడుపుపైఁ గొట్టంగఁ ◆ దలచు నెవఁడు

ప్రాణేశ్వరా నీచిత్తము నాయుద్యమమునుండిమరల్చి సుఖింపుము

జలం—తరుణీ నీవు నాకెట్టిభయమును గొలుపవలదు. నేను తలంచిన కార్యము నెరవేరునంతకు నిద్రింపవాడనుగాను. నీవు ఏ విషయమున మాఁకు బలుకకయుండుము.

బృంద—హా నాథా! ఇదియేమి సాహసము

సీ. నరకేశాకృప ♦ ప్రాప్తభూపాలునై
ఐశ్వర్యభోగంబులు ♦ చాలలేవో
మహనీయమణిమయ ♦ మందిరాంగణవాస
సౌఖ్యసంతోషముల్ ♦ చాలలేవో
సకలసామంతరా ♦ జన్య సమూహంబు
సలుపుచుండెడి నతుల్ ♦ చాలలేవో
అతిలోకనిర్మల ♦ ప్రతిభాపరాక్రమ
శౌర్యసాహసములు ♦ చాలలేవో

తే. గీ. పరుల కాంతలఁబట్టెడి ♦ పాపమునకు
నోడు పార్వతీదేవినిఁ ♦ గూడఁ బట్ట
సాహసించుచు నుంటివి ♦ శౌర్యవృత్తి
నమ్మహాదేవి మహిమంబు ♦ నరయలేక

నాథా యీప్రపంచమంతయు నాకు నీతోడనే యున్నది నాయందు నీవు కరుణించక నీపాదసేవకు నన్ను దూరముగఁ జేసినను నిరంతరము నీసేవ హృదయమునందే సేయుచు సాధ్వినై యుంటిని అట్టిచో నీవిప్పుడు సతీదేవినిఁ బట్టనరిగి నాకు దురంతచింత గూర్ప వలదు.

జలం—నేను నీయెదుట నున్నంతవరకు నేదియో యనవసరమైన సంభాషణ సేయుచునేయుందువు నేనిదే కైలాసమునకేగి సమయము వేచియుండి సతీదేవిని బాధించుకొని వచ్చెదనుగాక.

(నిష్క్రమించును.)

బృహ—హా నాథా ! నాథా ! (పరికించి) ఇంకెక్కడనాథుడు! ఈతడు నామాటలు పెడచెవిం బెట్టి శైలతనయార్థమై యరిగినాఁడు. ఇప్పుడు నేనేమి సేయుదును. ఎవ్వరిని వేడుకొందును. ఈతఁ డట్టియ కార్యము జేసెనేని త్రినేత్రునకోపాగ్నిజ్వాలలందుబడి భస్మముగాక యుండునా! అక్కటా ఈతఁ డెట్టి సాహసకార్యముసేయనెంచెను! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నేను విచారించుచున్నందువలన ప్రయోజనములేదు. నేనుగూడ నరిగి నాథుని యత్నమును గని పెట్టుచు నాశక్తికొలది వారింపఁ బ్రయత్నించెదగాక.

[నిష్క్రమించును]

ఇతి తృతీయాంకము.



# సతీతులసి

## చతుర్థాంకము.

రంగము:—(1)[కైలాసపర్వతప్రాంతవనములో సతీదేవి- ప్రవేశము]

సతి—(తనలో) పరమేశ్వరుని భార్యనైన నాకుఁగూడ సవతిపోరేకదా
మా కలహములుజూచి ప్రాణేశ్వరుఁడుపరిహాసము సేయుచుండును
ఇట్టి కలహములు స్త్రీలు తమలోదామే యంతరింపఁజేసికొనవల
యును గాని మగవారికిఁ జెప్పుట యెంతయుఁ జులకన కదా! కలహ
సందర్భమున నాగంగనన్నుఁగూర్చి పలికినయావాక్యము నాహృద
యమున నొక్కింత యనుమానము గలిగించుచున్నది (ఆలోచించి)
రుద్రాణినగు నన్నెవఁ డిట్లుసాహసించును నాయనుమానమే
నన్ను బాధించుచున్నది।గానిమఱియొకటికాదు.(ఎదుటజూచి) నన్ని
చ్చట నుండుమనిచెప్పిపోయిన చెలికత్తెయింకను రాకయున్నదేమి!
వచ్చుచున్నదేమోచూచెదగాక. (పరిక్రమించును)

(జలంధరుఁడు. ప్రవేశించును)

జలం—(తనలో) నేను నిన్నటినుండి వేచియుండగా, నిప్పటికి
పార్వతి యొంటరిగా నుండజూచుభాగ్యము గలిగినది. (ఎదుట
జూచి) అదిగో. ఆయింతి (పరికించి) ఈమె సౌందర్య మద్వితీయ
మైనది.

ఉ. వేయితలంప నేమిటికి ♦ విశ్వపదార్థములందు గల్గు బల్
సోయగ మొక్కచోట నిడి ♦ చూడగ గోర్కెజనించియుండు వా

నీయువతీప్రియుండు శశి । నీరరుహాద్యుపమానవస్తుల
త్యాయతబుద్ధిఁ గూర్చి వెల । యంగను జేసెఁ దలోదరీమణిన్.

ఇట్టి నారీమణి లభించుటచేతనే ఈశ్వరుఁడు మహాదేవుఁడైనాఁడు. (ఇంచుక యూరకుండి) నేనిట్లాలోచించుచు నున్నందువలనఁ బ్రయోజనము లేదు. ఆలస్యము జేసితినేని కార్యభంగమగును. సత్వరముగ నీమెను బట్టుకొని విమానముపైఁ బెట్టుకొని నిజనగరము చేరెదను. (నిష్క్రమించును.)

సతి — ఆ! దురాత్మా! ఎవ్వఁడవు గానీవు! సాహసంబున నన్నుఁ బట్టివచ్చితివి. [అని పలుకుచుఁ సతీదేవియు వెంట జలంధరుఁడు ప్రవేశము]

జలం — సతీదేవినిఁ జూచి(

ఉ. ఏను జలంధరుండ రమ । ణీమణి నన్ను నెఱుంగవా కొమ్మ: నీ
మానితసుందరాకృతికి • మానసమందున జాలమెచ్చి; యా
నూనశరార్తికిన్ మిగుల • సొక్కి నినున్ గొనిపోవఁ గోర్కెతో
నేనిటకేగు దెచ్చితిని • నీరజపత్త్రవిశాలలోచనా.

సతీ — (కోపముతో) ఓరీ! మాతృద్రోహీ! ఎట్టిసాహసకార్యము సేయ నెంచితివిరా! తల్లినగు నన్నే బట్టవచ్చితివికా! నీవిట్టి పరమపాతకుఁడ వగుదువని తెలియక బ్రహ్మరుద్రులు నిన్ను మహైశ్వర్యవంతునిగాఁ జేయుటం జేసి యిట్లు దుష్కృత్యములు సేయుచుంటివి.

తే॥ గీ॥ తగని పురుషునకును దొడ్డ • తనము గూర్చ
నగడు పడుటయె కాని పో • దలఁచి తనము
పిల్లకుక్కను దోడ్తెచ్చి • పల్లకి నిడి
యూరతిప్పిన నది దివ్వె • లాప్పకాదె

బాల్యమునందె నీను శ్రీహరిఁ జంపఁదలంచియు; బరమేశ్వరుని మొగముఁ జూచి యూరకుండుటచేత నిట్టివాఁడవైతివి - కానిమ్ము -

రుద్రునికోపానల జ్వాలల కాహుతికాఁగోరియే నన్నునేడిట్లు బట్టుటకు సాహసించితివి.

జలం——సుదతీమణీ! ఈ యనవసరసంభాషణతో నేమిపనియున్నది? నే నొకమాటఁ జెప్పెదను వినుము.

సీ॥ ఆవాస మెన్నంగ । నతిభయంకరమైన
భూతలంబు లుండెడి । ప్రేతభూమి
ఆహార మెంచంగ । నన్నులెవ్వరు దరి
జేరగాఁ జాలని । ఘోరవిషము
వాహనంబు దలంపఁ । బరిహాసమును సేయ
నిరతంబుదలఁయూఁచు । వృషభమూర్తి
బిచ్చమెత్తగ నెంచి । వేడ్కమై హస్తంబు
నఁ ధరించినది యా । నలువ శిరము

తే॥ గీ॥ పాములే నగలు, హితులు ♦ ప్రమథగణము
గాఁగ జరియించుచుండు నీ ♦ కాంతుఁ డేమి
సౌఖ్యముల నీయఁజాలును ♦ సారసాక్షి
గమ్ము పోదము నాదు పు ♦ రమ్మునకును.

బాగు సేయక లెమ్ము. (సమీపించును.)

సతి——తులువా! దూరముగానుండుము. పరమేశ్వరుని మహామహిమ నెఱుంగక యిట్టి యకార్యమును జేయవచ్చితివి. నిన్ను నేనేదగ్ధము జేయగలుగుదును గాని, నాధునియాజ్ఞ లేక పోవుట చేతను, నీ భార్యయు సాధ్వీశిరోమణియు నగు బృందం జూచియుఁ గరుణించితిని. ఇంతవరకును దాపసుల నేచుచుఁ దత్పత్నులఁ బలిమిబట్టుచు నార్జించిన ఘోరపాపముఁ జాలక నాకడకుకూడ వచ్చితివా?

జలం——సతీమణీ! నీవు నన్నిట్లు తృణీకరించి పలుకవలదు. నీసౌందర్యమున కీశ్వరుఁ డెంతయుఁ దగనివాఁడు.

తే॥ గీ॥ ఉవిద జన్వాసివి సుఖ బు ♦ లొల్లకీవు
బడుగు జోగికి భార్యవై ♦ బరగి తేల
రాత్రి ముఖమునఁ జ్యక తా ♦ రాప్రదీప్త
మైన శర్వరి మరుణున ♦ కగునె చెపుము.

ఈమాటలతో నేమిప్రయోజనమున్నది! రమ్ము. నాపురమున నన్ను గూడి సుఖంచెదవుగాక! (సమీపించును)

సతి—నీ కాయువుమూడినది. ఇంచుక కాలమిచ్చట నిలచియుండుము పరమేశ్వరుని మహిమ నీకుఁ దెలియును.

జలం—అతని మహిమ తెలియ కేమి!

క॥ తనువు విరూపాక్షము; పు
ట్టనుఁ గనరా దెరికిని డి ♦ గంబరత నెరుం
గనగును; ధనమును మాటయె
గనరా దతని మహిమంబు ♦ గానని జగతిన్.

శ్రీకంఠునికి గట్టిపెట్టిన తల్లిదండ్రులు నీ కెంతయు శోకమునూర్చిరి నిరంతరముసు మణిసౌధంబులయందు మెలఁగునిచరణములాతనితో పితృవనంబున మెట్టుట కెట్లోర్చుచుంటివి?

క. శ్రీచందనాస్పదములగు
నీ చనులు శ్మశానధూళి ♦ నెగడుటకుంటుఁ
నీచం బొందు గలుగునె యా
హా! చపలాక్షిరో సుఖంబు ♦ నట్టిది యానే.

సతి—ఓ! దుర్మతీ! బీదయు, సంపద్దేతువును స్మశాన సంచారియు జగత్పతియునగు శివుని మహాత్మ్యము నీబోటి మందు లెఱుంగఁ జాలరు (ఇంచుక యూరకుండి) నీతో నాకుఁ బనేమి? (ఇంచుక నడచును.)

ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) శివుఁడొక్కఁడే కాదు. ఆతనికి దోడింకెవ్వరైన రానిమ్ము. సతిని మాత్రము విడువక యుంచుదుగాక! సాధ్యమగునంతవఱ కాతఁడు రాకమునుపే యీ కాంతను బంధించుకొని పోయెదను. (సతిని సమీపించి) లెమ్ము. లెమ్ము ఇంకఁ గాలహరణమునకు నాచిత్త మొప్పదు.

సతి—దుర్మతీ! నీకుఁ గాలము సమీపించినది. ఉండుము.

(తెరలో)

మ. సురముఖ్యస్తవనీయుడైన సతినిన్ • సొంపార బంధింప, నే
దురితాత్ముండు దలంచె, వానిని జగ • ద్ద్రోహిన్ నిమేషంబులో
సురబృందంబు నుతింప శూలమున ని • వ్వోఁ జావగాఁ జేతు; ని
ర్భర మత్కోపదవానలంబును సహిం • పన్ శక్యుఁ డెవ్వాఁడగున్.

పర—(పై పద్యమును జదువుచుఁ బ్రవేశించి యిటునటు జూచుచున్నాఁడు.)

పార్వ—(పరమేశ్వరు నుద్దేశించి) హా! నాథా! దురాత్ముఁడగు జలంధరునిచేఁ జిక్కిన నన్ను రక్షింపుము,

పర—(జలంధరుని జూచి) ఓరీ! దుర్మతీ! నీచా! ఇట్టి సాహసకార్యమునకు సాహసించితివి.

ఉ. భామిని నీవిధంబునను • బట్టఁగ నెంచిన నిన్ను మామకో
ద్దామ కురిధాగ్ని కాహుతిగఁ • జప్పక చేసెద జూడు మిప్డు సా
ధ్వీమణు లెల్లరున్ మదుల • భీతిని వీడి చరింపఁగా, ముని
స్తోమము గూరిరుఁడీల్గె నను • చున్ ముదమందగ దుర్మదాధమా.

(సమీపించి) ఓరీ! జలంధరా! ఇంతవఱకును నీవు చేయుచుండిన దుష్కృత్యములఁ జూచ్చి నేను సహయు, నెవడు చేసినపాపము వాడే యనుభవించురని యూరకుంటిని. ఇప్పుడు నీవి తుపాంత్సాహ

భ్రష్టునన్నను గూడ బట్టుటకు సాహసించితివిగా! ఇంతకును నిన్నన
వలసినపని యేమియులేదు నా కారణంబున జనించిన నీ వనామకుం
డవై యుండకుండ, నిన్నొక రాజుగాంజేసి, వరంబులిచ్చి నందుకు
మాకుం గలిగిన ప్రతిఫల మిదియేకదా!

తే॥ గీ॥ ఎఱుకమాలిన వారల • కెంత మేలు
గూర్చిన దానిం దలచెదంగ • లేదు జగతి
విషయము మోంచి మెడమీద • బెట్టుకొనిన
దేహమంతయు జెఱచుంగా • దే దురాత్మ:

జలం —(పరమేశ్వరునింజూచి) శంకరా నీవాక్యములకిచ్చట భయపడు
వా రెవ్వరును లేరు. భాగ్యభోగంబులు లేక, జోగివలె నిరంతర
మును ప్రేతభూమిని విహరించు నీ సౌందర్యవతియగు నెలనాగ
యేల ఈమెను నాకొసంగుము ఇల్లయినను నీ హిమాచలాత్మజను
గొనిపోవుటకే వచ్చితిని. నీవు మాటలతో నొసంగవేని నిన్నురణ
మున నిర్జించియైనం దోడ్కొనిపోయెదను.

పర—ఛీ! మాత్సర్యదోషి! ఇట్టి యవ్యక్తప్రలాపంబులాడకుము

మ. సముదాటోప పతంగపుంగవవిభాన • స్వర్ణ చంచూసము
త్కమునం దల్పుకావిజృంభణానట • త్వాకోదరంబట్లు శౌ
ర్యమదోద్రేకుడవౌచు నన్నిపుడు జ • న్యత్రోసనిందాక జి
త్తమునం దెంచితివే దురాత్మ యిఃక నీ • దర్పంబు వారించెదన్

నాపరాక్రమమును గూర్చి నీ విదివఱ కెన్నండును వినియుండ
లేదు కాబోలు

జలం—వినియుండ కేమి

మ. గరిమన్ నిన్నెదరించు వీరవరు డొ • క్కండైన లేకుంటచే
నరుదారన్ భవదీయశౌర్య మనివా • ర్యంబై సుధీముఖ్యభా

స్వర సంప్రోత్రత కర్తృమై కదుబ్రికా ! శంబయ్యో; నింకన్ జలం
ధరుమోప్రిఁ భవదీయ పరాక్రమము వ్యర్థంబౌ సుమావల్లభా.

ఈ జలంధరుఁడు రాజాధిరాజై విలసిల్లుచుండె నని యెఱుఁగవా తేమి?

పర—ఓరీ ! నీవు రాజాధిరాజ వని గర్వించుచుంటివా ! ఇటువినుము చిత్రాభరణపటస్థితిఁ బ్రకాశించుటయుఁ, జామరానిలావృతిని గనుటయు, మదోన్నత కాయమున విఱ్ఱవీగుటయు, మానసస్వభావమున నుండుటయు, వాద్యధ్వనితో స్వారి వెడలుటయు, బరులు దూరంబుగాఁ దరుముటయుఁ దనవారి వాక్యములు విని తలయూఁచుటయు, జుట్టును ననేకులచే బరివేష్టింపఁబడుచుండుటయు, రాజమాత్రుఁడవైన నీకే యుండలేదు. ఇవియన్నియు గంగిరెద్దునకుఁగూడ నున్నవి ఓరీ ! గర్వచిత్తా ! వివేకజ్ఞానశూన్యుఁడవైన నీవు రాజువైననేమి కాకున్ననేమి ?

సతి—(పరమేశ్వరునితో) నాథా ! దుష్టచిత్తుండగు వీనితోఁ గాల యాపన మేల?

జలం—నిజమే. వృథావచనములతో నేమిపనియున్నది ? (పరమేశ్వరునిఁజూచి) ఓయీ ! పితృవనవిహారీ ! నే నీశైలసుతను దోడ్కొని పోవుటకు నీవు సమ్మతింతువా ? లేక రణంబుననిల్చి నాతోఁ బోరెదవా ?

పర—(కోపముతో) దురాత్మా ! ఏమనిరా ప్రేలితివి (త్రిశూలము చేఁ బొడువఁబోవును)

జలం—(తప్పించుకొని) రమ్మ్మా. రమ్మ్మా.

ఉ॥ ఆహవనామకాధ్వరము ! నందు మదీయభుజోల ! సర్వదా
సాహతచాపముక్తనిశి ! తాస్త్రమహాగ్నికి నిన్ను నివ్వదా

జ్వాహుతిగా నొనర్చుచు ర । యంబున నీమెను గొంచుబోదు మ
త్సాహసవిక్రమక్రమము । శౌర్యము జూడుము భూతనాయకా.

పర— (కోపముతో) నీతో రణముగూడ సేయవలయునా ?

మ॥ తరుణిన్ సాధ్విని లోకమాతను, సుశీలం । బ్రస్తుత్యపాదాంబుజన్
బరిభాషింపఁగ నోపమానసుడవై । భావించుటేగాక, సం
గరముఁ జేయఁగ నెంచుచుంటివె భళీ । కష్టాత్మ నాతోడ, భీ
కరశక్తిన్ బాలియుంతు నిప్పుడె లో । కంబుల్ ముదంబందగన్

దుర్మదచిత్తుండవగు నిన్నింకను బ్రతుకనిచ్చితినేని, లోకముల కపకారము జేసినవాడనగుదును, ఇదిగో! శక్తిని బ్రయోగించి నీ ప్రాణముల హరించెదగాక.

[అంత తొందరగా బృంద ప్రవేశించును]

బృంద— (పరమేశ్వరుని పాదములపైఁబడి)

తే॥గీ॥ శంకరాయ భక్తజనవ । శంకరాయ
కంధరాయ మహానీల । కంధరాయ
పురనిశాచర కర్కశ । పురహరాయ
పార్వతీరమణాయ తు । భ్యంనమోస్తు.

మ॥ సతతసర్వామరశీర్షసన్మకుటసం । తానంబునన్ వేలి కాం
తితతుల్ భానుని మించు తేజమున సం । దీపించుచుం [illegible]. సం
స్తుతనానామునిభక్తమానసగృహా । స్తోమంబులన్ దివ్వెలై
నుతినింగాంచెను నట్టి నీపదములన్ । గొల్తు సదా భక్తితోన్.

పరమేశ్వరా! సర్వాంతరాళానువర్తీ! పుణ్యమూర్తీ! బుధ త్రాణలోలా! భవదీయపాదారవిందస్మరణము, [illegible]గేశ్వరుడహా ప్రాతమును హరించు చంద్రమున, సమస్తపాపములను నశింపఁ

జేయును. ఆర్తనైన నేను నీచరణంబు వేడుచుంటిని. నీవు కోపమున గన్ను దెఱచి చూచితివేని, యీతఁ డెంతవాఁడు నా నాథుఁడు సద్గుణమూర్తి యని నేను చెప్ప నాహసింపను నా సాధ్వీత్వము దిలకించియైన నీతనిని రక్షించి నాకు బతిభిక్షబెట్టుము.

తే. గీ. అతని జన్మమునకుఁ గారణం • బనఘ నీవు
గావె! నీకటాక్షంబున • గాదె యిట్టి
వైభవంబును బొందుచు • వరలుచుండె
నీవు పెట్టినదీపంబు • నీవు యార్ప
దలచు టియ్యది ధర్మమే • లలితతేజ

(పార్వతినిఁ జూచి) హే! జగజ్జననీ భవన్మహామహిమ నెఱుంగ లేక, నీయెడల నకార్యము సేయనెంచిన నా ప్రాణేశ్వరుని గావ దగుము. (జలంధరుని సమీపించి) నాథా! ఇది యేమిసాహసము జగజ్జనని యగు సతీదేవినిఁ బట్టసాహసించితివి ఒక్కసారి మహే శ్వరుఁడు కోపదృష్టితోఁ జూచెనేని, లోకములాగునా? చాలుఁ జాలు. సాహసము తొలుత జేసిన సాహసము చాలక, యే దేవాది దేవుని మహితకరుణఁ గాంచఁగోరి మునీంద్రులు పరమనిష్ఠాగరిష్ఠు లై తపముసేయుచుందురో యట్టి భగవంతుఁడగు నీలగళునితోఁ గయ్యముగూడ సేయనెంచితివా? నాకు వైధవ్యదుష్టాలంకారము కూర్పఁదలంచి యిట్టి సాహసోద్యోగమును బూనితివని తలంచె దను. ప్రాణేశ్వరా! ఇంకనైనఁ జేసిన యపరాధమును మన్నింపు మని యీ పురాణదంపతులను బ్రార్థింపుము.

జలం—రమణీ! ఈ సమయంబున నీవిక్కడికేల వచ్చితివి? నా యుద్యమ మున కేలభంగ మొదవించెదవు? రణమున కీపురహరుఁడే గాదు. చతుర్దశభువనములును నొక్కపెట్టున నెత్తివచ్చినను వెనుదీయు వాడను గాను పొమ్ము.

పర—బృందా! గురుద్రోహియగు నీతనికి నాతోఁ గయ్యమొనర్చుట కిచ్చ జనించినది కాబోలు. కానిమ్ము. మదీయ కోపాగ్ని కింధన మగుఁగాక!

బృంద—తుషారభృత్కన్యకారమణా! నన్నుఁ జూచియైన నీ యాగ్రహం
బును విడువుము పుత్రుఁ డపరాధ మొనర్చిన దండ్రి రక్షించవల
యును గదా! ఈతఁడేమి నీతో గయ్య మొనర్చెనేమి!

సీ॥ భక్షింపవే లోక ♦ పరితాపమును వాప
నాభీలహాలాహ ♦ లానలంబు
రక్షింపవే యార్త ♦ రక్షా యనుచు నీదు
పదములు సేవించు ♦ భక్తసమితి
శిక్షింపవే సుర ♦ శ్రేణికి సౌఖ్యంబు
నమరఁ జేయఁగ ద్రివు ♦ రాసురులను
వీక్షింపవే శౌర్య ♦ విమదార్థమై భస్మ
మై పోవునట్లు ర ♦ మాకుమారు

తే॥ గీ॥ నన్ను రక్షింప యింక న ♦ నాథనైన
బ్రతుకఁ జాలను గాన నా ♦ భర్తఁ జేసి
నట్టి దుష్కార్యమెంచక ♦ యాత్మలోన
భక్తజనమానసోల్లాస ♦ పార్వతీశ.

సతి—(పరమేశ్వరునిఁ జూచి) నాథా! జలంధరుఁడు నాయెడల దుష్కృ
త్యము సేయఁదలంచినను, సాధ్వియగు బృందనుజూచి, యాతనిఁ
గరుణింపనగు.

పర—(బృందనుజూచి) బృందా! నిన్నుఁ జూచి, నీనాథుని రక్షించక దప్ప
దయ్యె. (జలంధరునిఁ జూచి) జలంధరా! ఇట్టి యవివేక కార్యముల
నింక నెన్నఁడును సేయఁదలంపక యుండుము. బృందమంగళసూత్రమే
నేఁడు నిన్నుఁ గాచినదని తలంపుము. పొమ్ము.

బృంద—ధన్యురాలనయితిని. పార్వతీ పరమేశ్వరులారా! నిరంతర
ము మీ దివ్యనామసేవ నా హృదయంబునఁ బాయకొని యుండు
నట్లనుగ్రహింపుడు.

సతి—సాధ్వీ! పోయి రమ్ము. శుభమగుఁ గాక (పరమేశ్వరుని గాంచి)
ప్రాణేశ్వరా! ఇంక మనము పోగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

బృంద — నాథా! నేఁజెప్పిన మాటలు వినక పరమేశ్వరునిఁబట్టఁ దలంచి వచ్చితివి. పరమేశ్వరుని కాగ్రహము పూర్తిగావచ్చినచో నాగతి యేమగును? ప్రాణేశ్వరా! ఇఁకను నీబుద్ధిమునిట్టి యధర్మకార్యము లందు బ్రవేశపెట్టుచు నాకుఁ జింతఁ గూర్పక కరుణింపుము. రమ్ము.

జలం — (తనలో) ఆగాదు మునిపత్నియగు చారుమతిని భంగము సేయఁదలంచ నష్టపడినది. నేఁడీ సతీదేవి విషయమునఁ గూడ నట్లే చేసినది. ఇది బ్రదికియున్నంతవఱకు నాయుద్యమము లన్నిఁటికిని భంగము గల్గుచునే యుండును. కావున నేమాయోపాయముననో దీనిని గడ తేర్పవలయును. (ఆలోచించి) సరే! ఇందుకు మంచియుపాయమే తోఁచినది. ఈ పర్వతముపైనున్న చిత్రములఁజూపుచు, నామాటలకుఁ దోడ్పడిపోయి దీనిపైనుండి సముద్రమునఁబడునట్లు ద్రోసివేసెదను

(ఇరువురు నిష్క్రమింతురు

రంగము. (2) (కొండపై జలంధరుఁడు - బృందయుఁ బ్రవేశము)

బృంద — నాథా! ఆలోచించుచుంటివేమి?

జలం — (తనలో) చిత్తమున నున్న కోపమూలమునఁ దీయు బయలు పెట్టరాదు. (ప్రకాశముగా) రమణీ! ప్రకృతిసౌందర్యమున కద్భుతమందుచున్నాను ఇటుఁజూడుము. చిరత్నరత్నమయ నిశ్రేణికాశ్రేణీ భ్రమదాభ్రతలోత్తుంగశృంగంబు లెట్లున్నవో గంటివా? అక్రింద భాగమింతయు ఘుమఘుమ పరిమళించు నితాంతవాసంతికా మల్లికాదివల్లికానుతల్లికల నల్లిబిల్లిగొని, మదనకదనంబున నదమదంబులగు త్రిదశకాంతలకుఁ బ్రియతమంబున బ్రాప్తించిన సంకేతసదనంబులనందనరు పొదలెంత చిత్రముగనున్నవో

బృంద — నాథా ఇటు జూడుము. తిమచక్రదనమునకు విద్యాధరీకాంతల మక్కువ బడదేయుచు, దమక అచిన యురగసంతతులఁ బాఱ వైచి, వాసిని మాటిమాటి కక్షీణపక్ష విక్షేపణంబుల నడంచియు

ఉంచూపుటంబులఁ బొడిచియుఁ బరుషచరణాగ్రంబుల నడచియు కరనఖరంబులఁజీరియు, దీటని కినుకతో వివిధగతులఁజెలంగుబర్హిగణము లెట్లున్నవో!

బలం—సహజ సౌందర్యమునకేనియు సాటిరాదుకదా! ఆవనంబునగల మృగసంతతులపై నొకసారి దృష్టిఁబఱపుము.

గండభేరుండముల్ ♦ గడురంతు లిడఁజూచి
సత్వరంబుగ బాఱు ♦ శరభ చయము
శరభంబులేగెడి ♦ చప్పుడు వినవచ్చి
తరులచాటున డాగు ♦ హరిగణంబు
హరిగణధ్వానంబు ♦ నాలించి నిశ్చేష్ట
త వహించి నిలచు మ ♦ త్తగజసమితి
మత్తగజంబుల ♦ మార్గంబు నీక్షించి
శీఘ్రుంబుగా బాఱు ♦ చిరుతగండ్లు

తే. గీ. చిఱుతగండుల చప్పుడు ♦ చెవికిఁదగిలి
చెంగు చెంగునదాటు ♦ కురంగతతులు
గలిగి మిగుల చిత్రంబుగా ♦ జెలగుచున్న
నమ్మహావనిఁగంటి వా ♦ యబ్జనేత్రి!

ఇంకను మనమామూలనుండి చూచినచో మఱింతచక్కఁగాని పించును. రమ్ము. (ఇంచుక నడచుచున్నారు)

బృంద—(క్రిందకుఁజూచి) ఈ పర్వతాగ్రముననుండి, సముద్రమునకై చూచినచోఁ గన్నులు తిరుగుచున్నట్లుండును.

బలం—తరుణీ! ప్రభాకరబింబము జలములయందెట్లు ప్రతిఫలించుచున్నదో చూచితివా!

బృంద—(సముద్రమునుఁ జూచుచుండును)

బలం—(తనలో) ఇదియే సమయము.

[బృందను సముద్రమునఁ బడునట్లు త్రోయును.]

బృంద—హా! (అనుచు సముద్రమునఁ బడుచున్నది.)

జలం—నేఁదలఁచిన పనియైనది. (నిష్క్రమించును.)

(తెర లేచును)

సముద్రము:—(బృంద జలములలో నిటునటు గొట్టుకొనుచు

నుండఁగా విష్ణుమూర్తి - ప్రవేశించును.)

బృంద—(జలములందుండి) నారాయణ ! నారాయణ !

విష్ణు—(జలమునందున్న బృందను జూచి తనతో) అక్కటా! దురాత్ముండగు జలంధరుఁడీ బృందయెడల నెట్టిదుష్కృత్య మొనర్చినాఁడు ! నేనిప్పుడీమెను రక్షించెదఁగాక. (జలములలో దిగి) సాధ్వీమణీ! భయమందకుము. ఆర్తరక్షణుఁడనైన నేను నిన్ను రక్షించుచున్నాను. (బృందను దీసికొని యొడ్డునకు వచ్చును.)

బృంద—(విష్ణుమూర్తినిఁ జూచి) శాశ్వతసౌఖ్యమునందుటకై విధిప్రేరణమునని౦దుఁబడిన నన్ను రక్షించితి వేల? మహాత్మా! కరుణాసు[illegible]డవైన నీవెవ్వరవో యెఱుంగవచ్చునా ?

విష్ణు—బృందా! [illegible]

తే. గీ. ఏను నీహృదయ[illegible]

యుంటి; నీవు నా[illegible] లో[illegible]

నఖిల భక్తుల హృదయంబు[illegible]

నన్నుఁ నెఱు[illegible] నీవు [illegible]

బృంద—(తనలో) ఓహో! [illegible]

సారి యీ మహానుభవుం[illegible]

నాకొసంగి, మదీయగుణపరీక్షార్థమై నన్ను మోహింపనట్లు న[illegible]

నాడు. భగవంతుఁడు భక్తజనమానసంబుల ననేక విధంబులఁ బరీక్షించుచుండును గదా! [పరిహాసముగా] ఆర్తరక్షామణీ! భవదీయ దివ్యమంగళవిగ్రహ మొకసారి దర్శించియుండియు, నేడజ్ఞానంబునఁ బడి కనుఁగొనలేకపోయితిని. మన్నింపుము.

మ॥ కలనైనన్ సుఖంబుగాదు భవదాకారంబు దర్శింప, నా
నలినప్రోద్భవ ముఖ్యదేవతలకైనన్ నేను మల్లోచనో
త్పలముల్ ధన్యతగాంచిమించగ భవద్భద్రాయితాస్యేందు మం
డలి వీక్షించితిఁ గ్రిమ్మరన్ విమలవృత్యం బెట్టిదో మాధవా.

సముద్రమునఁ బడిన నేను ప్రాణముల బాసియుంటినేనిసినాన్ని ధ్యమునుఁ జేరియుందునుగదా! నన్నేల రక్షించితివి ?

విష్ణు—భక్తరక్షణము నాయుద్యోగమేకదా! [తనలో] ఈమెజలంబునఁ బడుటకు గారణమడిగిన నేమిచెప్పునో [పరిహాసముగా] నారీమణీ! నీవి జలరాశిం బడుటకుఁ గారణమేమి ?

బృంద—భగవంతా! నా హతాకృతి ప్రారబ్ధమని చెప్పుటకంటె వేఱే మియుఁ జెప్పఁజాలను.

విష్ణు—పతి నిరాదరణమే కారణమని యూహించెదను.

బృంద—[మాటలాడక యూరకుండును.]

విష్ణు—నిరుత్తర మంగీకార సూచికమా !

బృంద—దేవా! ఇప్పుడీ యనవసరమైన సంగతియేల ?

విష్ణు—బృందా! నీభర్తచేసిన యకృత్యము నీవు చెప్పక దాచినచో నాకుఁ దెలియ దనుకొంటివా ?

బృంద—సకలాంతర్యామి వగు నీకుఁ దెలియని విషయ మేమున్నది ?

విష్ణు—నీయం దట్టి నిరాదరణ భావము వహించిన పతినిఁ బట్టుకొని యేల ప్రాకులాడెదవు? జగన్నియామకుఁడవగు నాయభీష్టము, దీర్ఘ శుభంబుల బడయ తలంపవేల ?

బృంద—లోకేశ్వరా! నాహృదయ మింతవఱకే నీకుఁ దెలిసియున్నది. ఇంకను నన్నేల పరీక్షించఁదలంచెదవు

ఉ. దేవుఁడవైనఁగాని మఱి ♦ దేవుని యబ్బవు నైనఁగాని నా
భావ మధర్మమార్గమున ♦ వర్తిలనెంచదు వేయునేల నీ
వీవిధిః బెక్కుభంగులను ♦ నేల పరీక్షను సేతువయ్యల నీ
క్ష్మాపతి భర్తృసేవ సతి ♦ కిన్ సకలార్థము లిచ్చుగాదొకో

విష్ణు—పోనిమ్ము ప్రాణదానము చేసినందులకు నాకేమి యుపకారము సేయుదువు

బృంద—మహాత్మా ఉత్తమపురుషు లెప్పుడును నుపకార మొనర్చి ప్రత్యుపకారమును గోరరు భువనాధీశ్వరుండ వగు నీకు నేను ప్రత్యుపకారముఁ జేయఁజాలినదాననా? నీపాదారవింద సేవపై నిరంతరమునా చిత్తము గలిగియుండునట్లు మాత్రమనుగ్రహింపుము

విష్ణు—అట్టయిన నీవిప్పుడు నాయాజ్ఞను సరింపుము.

బృంద—అధర్మముగాని దెట్టిగార్యమునైనఁ జేసెదను

విష్ణు—నీవిప్పుడు బృందావనంబున నుండుము. నీనాథుడు తనంతతా నీకడకు రాగలడు

బృంద—పతి పదసేవ చిత్తమునందుఁ జేసికొనుచు భగవదాజ్ఞను సరించెదగాక

(నిష్క్రమింతురు)

రంగము:—(3) వైకుంఠము—విష్ణుమందిరముముందు:...

ఇంద్రుడు - గాలవుఁడు - ప్రవేశము

ఇంద్ర—మునీంద్రా! గాలవా! జలంధరుడుసేయు దుష్కృత్యములు నానాటికి హెచ్చుచున్నవిగాని తగ్గుటలేదు. ఇంక నెన్నాళ్లోర్పిక బట్టగలము

గాల—ప్రతిని దుష్కృత్యములన్నియు శ్రీమన్నారాయణుఁడు చూచు చుండియు నిట్లు శాంతివహించి యుండుటకుఁ గారణ మూహింప జాలకయున్నాను.

ఇందు—తాపసోత్తమా! అదుగనిదే యమ్మ్రమైనను బెట్ట దను సామెత నెఱుఁగవా! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు దానింగూర్చి యోచింపనేల భగవంతుడగు శ్రీహరికి జలంధరునిఁగూర్చి విన్న వింతము కరుణాసముద్రుండగు నాతం డెట్లుచేసినను సరే

గాల—(ఎదుటఁజూచి) భగవంతుఁడు మందిరమున లేడాయేమి అయి నను నిట్లు బిలచిచూచెదఁగాక

(ఎదుటఁ జూచుచు)

సీ. మా మొరాలింపవు • మహనీయ పటపతి
 నీమనపైని దగ్గిరకు • చేరినావొ
కరుణఁజూపింపవు • కమలాలయా దేవి
 నెడబాయజాలక • యొనఁగినావొ
కాపాడ నెంచవు • నీపదంబుల భక్తి
 జింతించు వారికిఁ • జిక్కినావొ
రక్షింపఁజూడ వే • రాక్షసాధముడైన
 నాలమున,గూల్ప • నఁగినావొ

తే. గీ. కాకయుండిన నారీతిఁ గలుషచిత్తుఁ
 డై జలంధరుఁ డొనరించు • నట్టి కౄర
 కార్యములఁ గాంచు చుండియుఁ • గావనట్లు
 సైచియుంటివి యిదియేమి • జలరుహాక్ష

ఇందు—అదుగో శ్రీమన్నారాయణుఁడు. మనకు దర్శన మొసంగుట కిట్లువచ్చుచున్నాఁడు.

విష్ణుమూర్తి - ప్రవేశించును

ఇందు—(విష్ణుమూర్తినిఁజూచి). లక్ష్మీకళత్రా! వందనములర్పించు చున్నాను

విష్ణు — మహేంద్రునకు శుభమగుఁగాక! (గాలవునిఁ జూచి) ముద్రా వందనములు. (ఇంచుకయూరకుండి) మహేంద్రా! (గాలవునిఁగాంచి) తాపసోత్తమా! ఈ యాసనము లధిష్ఠింపుఁడు.

(అందఱును నాసీను లగుదురు.)

విష్ణు — అమరలోకవిభుండగు నీవును దాపసోత్తముఁడగు నీగాలవుండును నేడిరో యొక్కవిశేషకార్యముండి యేతెంచిరని తలంచెదను. నేను మీయెడలఁ జేయవలసిన కార్యమెద్ది?

గాల — ఇందిరారమణా! సర్వము నెఱింగియుండియు మాచే వినఁగోరి యడిగెదవు? జలంధరుని దుష్కృత్యములలో నీవెఱుంగని వేమున్నవి?

సీ॥ ఆలింపవదియేల • యాశ్రమంబులఁజొచ్చి
సంయమీంద్రులఁ బెట్టు • శ్రమల నెల్ల
నరయకుంటి వదేల • యజ్ఞవాటిక లెల్ల
నేలమట్టము సేయు • నీచగుణము
జాలిబూనవదేల • సాహసంబున లోక
ములనేచు దుర్మార్గ • ముఁ దిలకించి
చెవిఁజేర్పవదియేల • శ్రీహరీ యని వేఁడు,
తాపస సతుల యా • ర్తారవంబు

తే॥ గీ॥ అన్నియును జూచుచుండియు • మిన్నకుంటి
వేల: ఆజలంధరుఁ దున్మ • వేల? నీవు
గాక మాకు లోకముల ర • క్షకుఁ డెవండు?
శ్రితజనావనశీల! ల • క్ష్మీకళత్ర.

నారదుఁడు — (ప్రవేశించి విష్ణుమూర్తినిఁ జూచి) నిజము నిజము! జలంధరుని దుష్కృత్యము లపారముగ నున్నవి.

తే॥ గీ॥ తనకుఁ దల్లియౌ నావనియైనఁ • దలఁపకుండ
శంభురాణినిఁ బట్టంగ • సాహసించె

యిట్టి కార్యంబె చేసిన • హీనునకును
వరమునిందుకై లపత్ని లే • పాటివాడు
గొప్పవారాడల లోగొనఁ • గొట్టువాడు
నకుఁ గలవ తెప్ప యరయు జం • తికలు గావె.

ఇంద్రు—నారాయణా! ఆజలంధరుఁడు తాపసాశ్రమము లందుఁ బ్రవే
శించి చేయుచున్న దుష్కృత్యముల వచింప నలవికాదు- ఈమధ్య
తన దుండగములమరలోకము పైనఁగూడ బ్రారంభించినాడు.
అమర కాంతలనుగూడ బాధింప మొదలిడినాడు. ఒక్కఁడయ్యును
సంగరమునకు వెనుదీయడు. పరాజితుఁడు గాడు

గాల—తాపసాశ్రములఁ బ్రవేశించి మునిపత్నుల బల్మిని గొనిపోవు
తరిని. మునుల కలుకవొడము బృందా సాధ్వీత్వమునకు భయమంది
శపియింపఁజాలకయున్నారు-ఇంతను మున్న సాధ్వియగు బృందయూ
తనికడ నున్నప్పుడు శ్రీయన్నంతో వఱకెట్టి యకార్యములుజరుగ
కుండఁ జేయుచుండెను. ఇప్పుడాసాధ్వి దుర్మార్గుఁడగు జలంధరునిచే
సముద్రమునఁ ద్రోయంబడి, నీచే రక్షింపఁబడి బృందావనమునుండి,
నీయందేఁజిత్తముఁ జేర్చి, స్వామిం డైనను దనపతి కెవ్వరివలనను హాని
కలుగకుండునుగాక యని నిరంతరతపోవ్రతయై యున్నది.

ఇంద్రుడు—భగవంతా! ఇంక సీవా జలంధరుని విషయమై ప్రయత్నించక
పోయిన, సాధ్వీమణుల మానసంరక్షణమునకు మార్గములేకయుండును.

విష్ణు—మహేంద్రా! జలంధరుని దుష్కృత్యము లన్నియు నే
నారయుచునేయుంటిని బృంద మహాసాధ్వి. ఆమె సాధ్వీత్వమున
కొక్కింతయేని భంగము గలుగనిచో జలంధరుఁ డేహానియుఁ
బొందడు.

ఇంద్రుడు—దేవా! సకలామరమునిజన క్షేమమై నీపై కార్యభరమును
బూనవలెను.

విష్ణు—(తనలో) ఇదియు నొకమేలె. (ప్రకాశముగా) లోకహితార్థమై
యికార్యంబునకుఁ గడంగెదనుగాక! (నారదునిఁజూచి) నారదా!

ఈవిషయమున నీవుగూడ నాకుం గొంత సహాయమును సేయవలసి యున్నది.

నార—భగవదాజ్ఞ శిరమున దాల్తునుగదా.

విష్ణు—నీవరిగి జలంధరుని బరమేశ్వరునిపై యుద్ధమున కరుగఁ బ్రేరేపింపుము.

ఇంద్రు—ఇట్టి కార్యము లన్న నీ మహాత్మునకు సంతోషమేకదా! (ఇంచుక యూరకుండి) దేవా! ఇఁక మా కాజ్ఞనిమ్ము.

విష్ణు—శుభమగుఁగాక!

(గాలవుఁడు - ఇంద్రుఁడు - నారదుఁడు - నిష్క్రమింతురు)

విష్ణు—(తనలో) నేను జలంధరుని వేషముతోడ బృందను జేరి వంచింపవలయును. (ఆలోచించి) కానిమ్ము. తుదకీయుద్యోగ మెట్లు పరిణమించునో చూచెద.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.



## సతీతుల సీ

### పంచమాంకము.

రంగము:—(బృందావనమున బృంద విచారముతోఁ బ్రవేశము)

బృంద—(తనలో) ఆహా! విచారాక్రాంతచిత్తులకు నిద్ర రాదుగదా అకటా! నాస్థితి కేమని వగతును? నాకిట్టిగతి సంభవించునని కలనైనఁ దలంచియుంటినే. నాప్రాణేశ్వరునకు సన్మార్గమునవలంబింపుమని చెప్పుటచేత నేనెంత విరోధినయితిని. లోకమాతయగు పార్వతిని బట్టుటకు సాహసించి, రుద్రుని కోపానలజ్వాలలకాహుతియగుటకు సంసిద్ధుఁడైయున్న యాతనిని రక్షించినందులకుఁ బ్రత్యుపకారముగ నన్ను జలరాసిం బడద్రోచెనుగదా! జలంధరు నుద్దేశించి) హానాధా!

సీ॥ పరకాంత గూడుట ♦ పాపమంచును దెల్పి,
తినిగాని మతియేమి ♦ తెలుపలేదు
మునిపత్నులనుగాంచి ♦ మోహమందుట గూడ
దంటిని నింకేమి ♦ యనఁగలేదు
వరమునీంద్రులఁగాంచి ♦ పరిహాసమొనరింప,
వలదంటి నొండేమి ♦ పలుకలేదు
భవదీయ పదసేవ ♦ వాంఛించితి నటంచు,
వేడితి మతిశుద్ధి ♦ వేరలేదు
తే॥ గీ॥ కటాకటా నీకునై యింత ♦ కష్టపడెదు
సాధ్వినగు నాకు నీగతి ♦ స్వాంతమందు
దుఃఖమును గూర్చుటేగాక ♦ తోయరాసి
ద్రోచినాడ వేమందు నీదుష్కృతికిని.

ఆనాడు జలరాసియందు నీవు నన్ను ద్రోసినప్పుడు భగవంతుండగు శ్రీమన్నారాయణుండు నన్ను రక్షించి యుండనిచో నాకీవిచారమే యుండదు ఆమహాత్ముఁడు నన్నేల రక్షించెనాయని చింతించుచుంటిని. నాథా! మున్ను నారదుఁడు నాకడకరుదెంచినీవొనర్చుచున్న దుష్కృత్యములఁ గూర్చి చెప్పిన విని నేనెంతయు విచారించితిని. నేనేమి సేయుదును? ఇంక దేవత లందరును నీపై నలిగి యేమి సేయుదురో కదా! నీవు నన్నుఁ జంపినను రక్షించినను? నీవే నాకు గతియని తలంచి మున్నునారదుం డరుదెంచి నీవమరలోకమునకరిగి యుంటివని చెప్పి నీకడకు రానున్న నన్ను వారించెను. ప్రాణేశ్వరా నీవు నన్నాగ్రహ గ్రనుఁడవై నీపద సేవ నాకీజన్మంబున నొసంగుదువా ఆభాగ్యము నేను నోచుకొనియుంటినా? (ఇంచుక యూరకుండి) నన్నుఁ జంపఁదలంచిన నీవు నన్నుఁ గరుణింతువా? నీచే నిరాకరింపఁ బడిన నేనెన్నాళ్ళింక నిట్లు బ్రదుకుదును? కాని. జీవించి యున్నంతవఱకు నాహృదయమున నీసేవయు, నిష్కళంకతయు మఱువకుండ నున్నంతవఱకు నీకేవిధమయిన హానియు నెవరివలనను గలుగకుండుఁగాక! (దిక్కులుఁజూచి) ఇంక నెప్పటికి దల్లవారునోకదా! (ఆకాశమువంక జూచి;

మ॥ తనచేఁ బోషణ సేయఁగాబడెడు ప ♦ ద్మశ్రేణి బాధింతు, నీ
వని? భావిం చిదె వచ్చె నీపయికి నెం ♦ తైనం జనం బెల్లు నీ
కని. ప్రేమంబును బూని వార్తజలజా ♦ తారాతికిఁ దెల్పవ
చ్చినచందంబున వేగు చుక్క యుదయిం ♦ చెఁ బూర్వభాగంబునన్

(ఇటునటుఁజూచి కోడికూత వినుట నటించి)

మ॥ ధరణిం జూడఁ(ది) కాలబోధమున కా ♦ ధారంబు మత్కాంతను
స్వర మే యానుగదా మదుచ్చరిత శ ♦ బ్దం బల్పమేయంచు దు
ర్భరగర్వం బెఱిఁగించుచుం(గిరిబ్ర)యమూ ♦ రన్ గుక్కుటశ్రేణి భా
స్వరలీలన్ వడికూయసాగె నదె వి ♦ శ్వగ్రామ ధామంబులన్

(ఆకాశము వంకజూచి) అదిగో రేచిల్కచెలి యుదయాచలేంద్ర

వల్మీకముమీఁద బ్రత్యూషపర్వ సమయంబు విడిచిపోయిన నిర్మో మనునట్లు తూర్పుదిక్కునఁ బాండిమద్యుతి జనించినది. ఇఁక నేను సూర్యోదయము గాకపూర్వమే కాలకృత్యముల నిర్వర్తించుకొని స్నానముఁజేసి భగవదారాధనయందు జిత్తమును ప్రవేశపెట్టెదను గాక (నిష్క్రమించును]

విష్ణుమూర్తి జలంధర రూపముతోఁ బ్రవేశించును,

విష్ణు — (తనలో) నారదుని ప్రేరేపణమున జలంధరుఁడు శివునితో యుద్ధమున కరిగినాడు. ఇప్పుడు వారిరువురకును పోరు ఘోరమై యుండును, (ఆలోచించి) ఇఁక నేనాలోచించ నేల? ఈ వేషముతో బృందం జేరెదఁగాక! తనభర్త దురాత్ముఁడయినను నాతని పద చింతనము హృదయమునందువిడువక నిరంతరమునాతని క్షేమమునే గోరు పరమసాధ్వని నెట్లు వంచింపఁగలనో తెలియరాదు. (ఎదుటఁజూచి) అదిగో బృంద

తే. గీ. జాగరారుణిలోచనా ♦ బ్జములతోడ
దంతవదశోభితాపరా ♦ ధరముతోడ
విడుదులంటెడు మేలైన ♦ కురులతోడ
నలరుబృందమోమును జూడ ♦ హర్ష మొదవె.

ఈమె యిప్పుడే స్నానమాచరించి భగవదారాధనయందుఁ జిత్తము జేర్చుటకు దలంచుచు సూర్యోదయమునకు గాచుకొని యెదురుచూచుచున్నది. (పరికించి) ఆమె యిట్లేవచ్చుచున్నది. నేను నెమ్మదిగా నెదుటబడి నా యుద్యోగమున వర్తించెద. ఆహా

తే. గీ. అఖిలలోకాదినాథుండఁగు ♦ నైన నేనె
యొక్క యువిదపై సమ్మోహ ♦ మూనియిట్లు
దేవహీత మను నంకపై ♦ దెలివిమాలి
వచ్చితిని నీతిలోఁదరిఁ ♦ వంచనంబు
సేయ జనము లీకార్యమీ ♦ క్షించినన్ను

గ్రైలాగ్రకయుఁద్రి సూదర్శ ♦ కంబుగాఁగ
కంచెదో చేను మేసిన ♦ గలదె దిక్కు.

[ బృంద-ప్రవేశించును. ]

బృంద—(ఆకాశమువంకఁ జూచుచు)

సీ॥ ఉగ్రమహాంధకారధరే ♦ శ్వరుఁడు ధరించెడి,
మహనీయకోటీర ♦ మణి యనంగ
బలభిత్కుమారుని ♦ పాన్పుపైఁ గట్టిన,
పంతైన పవడంపు ♦ బంతియనఁగ
బ్రత్యూషతరుణి, శ్రీ ♦ రామకై యెత్తిన
దివ్యనీరాజన ♦ దీపమనఁగ
దొలిదిక్కుపూఁబోఁడి ♦ ఫాలికభాగమునందు,
దీపించు కాశ్మీర ♦ తిలకమనఁగ
తే॥ గీ॥ స్వతరుణారుణ కాంతులు ♦ భాసిలంగ
సకలజగముల నానంద ♦ జలధిముంచ
నాత్మలోపల భావించి ♦ యా పయోజ
మిత్రుఁడదిగో పూర్వాద్రి ♦ మీఁదఁ దోఁచె.

(ఇటునటు జూచి) ఆహా! ఏమి! ఈపురుగులయొక్క విచిత్రగతులు!

సీ॥ లేమావిచిగురును ♦ లేమ నోటనుబెట్టి
ముదమున నా దిశు ♦ భూరిపికము
జంట బాయఁగలేక ♦ సంతసమ్మున నంత
మధువు నరసెడి ష ♦ ట్పదమిథునము
మాటిమాటికి దన ♦ బోటినిఁ బిల్చుచు,
మించుహర్షమునఁ జ ♦ రించుశుకము
విడచిన నేహాని ♦ యడరునో యని పేడ
మెడఁగలిపితిరిగెడి జక్కవలజోడు
తే॥ గీ॥ ప్రకృతి నింక నుండిన జీవరాసు లెల్ల
కలిత దాంపత్యసౌఖ్యంబు ♦ గాంచుచుండ

నా పూరాకృతకర్మము • నకు మనంబు
నంము నేమని వగతు ని • శ్లైతి నేను.

విష్ణు—(తనలో) ఇదియే మంచిసమయము. (తొందరగా బృందను సమీపించి)

మ॥ తరుణీ! నీయెడ నేను జేయు నపరా • ధం బెల్ల మన్నించి, స
త్కరుణావర్షము నాపయిం గురిసి, నీ • కౌఁగింటిలోఁ జేర్చి నా
వెరపుల్ మాన్పుము; బుద్ధిశక్తియను మహా • విజ్ఞాన మబ్బెన్; నిరం
తరముల్ శిక్షయనంగ నాల్చెద భవ • ద్వాక్యంబులన్ సుందరీ?

చ॥ గతజలసేతుబంధమున • కైతలపోయుట పాడిగాదు; దు
ర్మతినయి నేను నీ బలుతె • ఱుంగుల బాధలు వెట్టినాడ; నీ
మతి నవియెల్లఁబో విడిచి • మానిత సత్కృపనాదరించి; యిం
చితగతి నేలుకొమ్ము నర • సీరుహపత్రవిశాలలోచనా.

బృంద—(తనలో సంతోషముతో) ఆహా! నేఁడెంతయు సుదినము. భగవదనుగ్రహమువలన, నానాధునకు నాయెడఁ గరుణ జనించినది. ఈతఁడు తానొనర్చిన యకృత్యములకుఁ బశ్చాత్తాప మందుచున్నాఁడు. ఈతని పదసేవ నాకు లభించుటంజేసి నేను కృతార్థురాలను. (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! ఎన్నాళ్లకు నాయందు దయవచ్చినది. నిన్నుఁ గరుణించుటకు నేనెంతదానను?

శా॥ రాకాచంద్రునిరాకకున్ నిశ చకో • రంబట్లు చండాంశు శో
భాకారంబునకున్ సరోజములులే • యత్యాశతో నెప్పు నీ
రాకన్ గోరుచు నున్నదాన నిట; నన్ రక్షింప భావించి యో
హో! కారుణ్యము బూని వచ్చితివి ధన్యంబయ్యె జన్మంబిఁకన్.

నాథా! ఇప్పటికైన నాయందు కరుణగలిగినది. నీవు నాయందు నిష్కరుణవహించి నీపదసేవకు నన్ను దూరముగఁ జేసినను, నేను నీపాదసేవ మరచియుండలేదు. నాయెడల నీవు గినుకవహించి జలరాశిందొరియ శ్రీమన్నారాయణునియనుగ్రహమున బ్రదికితిని.

లేకున్న నేపీపాటికి స్వర్గసౌఖ్యము ననుభవింపుచునే యుందును. ఇంతకును నీచరణంబుల గొలిచి కృతార్థురాలనగుటకు గాబోలు బ్రతికియుంటిని.

విష్ణు—(తనలో) ఈమె నన్ను జలంధరునిగనే భావించినది. ఇంతవఱకును నాప్రయత్న మనుకూలముగనేయున్నది. (ప్రకాశముగా)

ఉ. నీవు మహాపతివ్రతవు ♦ నిర్మలధర్మవివేకశీల స
ద్భావము నీదుసొమ్ము; జన ♦ వంద్యను నిన్నును నేనె యట్లు దు
ర్భావముఁబూని హింసలకు ♦ బాలొనరించితి; వాని సైచి; మో
దావహచిత్తమూని చరి ♦ తార్థుని జేయుము సుందరీమణీ.

బృంద—మనోహరా! నేను నీకరుణకు బాత్రురాలనేగాని వినుతికిఁ గానుఁ గడచినదానికి నీవుగాని నేనుగాని చింతించినందు వలనఁ బ్రయోజనములేదు. ఇంక మనమాసంగతి మరచిపోవలయును.

విష్ణు—

మ॥ జలజాక్షీ! భవదీయవాక్యములనే ♦ స్వాంతంబునం దెంచకే
పలుభంగుల్ నినుహింసఁబెట్టితి బరా ♦ జ్ఞాతాత్ములం బట్టితిన్
గలితోగ్రప్రధనంబులన్ విబుధులన్ ♦ గారించితిన్; దానవా
వళి బాధించితి వారిసన్నిధిఁ గటా ♦ బంధించి తత్పత్నులన్.

ఇది యంతయు నట్లుండ, ముక్కంటిచే భస్మముగాకుండ నన్ను రక్షించిన మహాసాధ్వీశిరోమణివగు నిన్ను సముద్రమునఁ గూలవైచితిని. ఈపాపములన్నియు నేవిధమునఁ గట్టి కుడుపునోకదా! (విచారమునటించును)

బృంద—మనోహరా! పాపమునకు బశ్చాత్తాపమునొందిన వారా పాపము ననుభవింపరని యార్యులు చెప్పుదురు.

విష్ణు—భయాకలితచిత్తుండనగు నన్ను నీ భుజ పంజరమున జిక్కించుకొని వెఱపు మాన్పుము. (కౌగలించుకొనుచున్నాఁడు)

బృందా—జీవితేశ్వరా! గతించినసంగతులఁ దలంచుకొని యేల విచారించెదవు?

తే. గీ. నీవరిష్వంగసౌఖ్యంబు ♦ నిక్కముగను
వర్ణనముసేయఁ గవికైన ♦ వశముగాద
టంచు, బలుగంగ నగునఁగాదె ♦ యట్టియెడల
పదము లుండునె నాకుక్షి ♦ బద్మనయన.

[జలంధరుని శిరము వారిముందుఁ బడును]

బృందా—(లోందరగా విష్ణుమూర్తి చేయి విడిపించుకొని జలంధరుని శిరము జూచి) హా! ఇదియేమి! (మూర్ఛిల్లును.)

(విష్ణుమూర్తి నిజరూపము ధరించి నిలచును.)

విష్ణు—(తనలో) ఈవ్యాపారము తుద క్షేమగునో కదా.

బృందా—(విష్ణుమూర్తి నిజూచి) హా కపటనాటకసూత్రధారీ! ఎంత మోసముచేసితివి! (భర్త శిరమును బట్టుకొని) హా! ప్రాణేశ్వరా! నీవీప్రపంచమును విడిచిపోయితివా?

ఉ. అయ్యయొ జీవితేశ, యిటు ♦ లైతివె యిందుల కేమిసేతు, నా
కెయ్యది యింక దిక్కు మఱి ♦ యెవ్వరివేడుదు రక్షసేకు
యెయ్యెడ నీశిరం బకట ♦ యీదశ బొందఁగ గాంచియుండియున్
బ్రయ్యలుగాకయుంటి లల ♦ నల్ కఠినాత్మలు గారె యారయున్

హా మనోహరా! నాయెడల నీవు నిష్కరుణవహించి నన్ను బాసినను, నీపదసేవయె చేయుచు, నాసుమంగలత క్షేమము భంగము రాదు కదాయని తలంచితిని వంచకుడైన హరి భవదీయాకృతిఁ దాల్చి వచ్చుట యెఱుంగక నీవేయని భావించి నీపదదాస్యము లభించెఁగదాయని యెంతయో సంతోషించితిని. అక్కటా! నీకిట్టి దుర్దశ గలిగించిన దెవ్వరోకదా!

విష్ణు—రణమున ముక్కంటిని దాకుటచే నీగతి బొందెను.

బృంద—(భర్తనుద్దేశించి) జీవితేశ్వరా ? ఇంక నేనెంత విచారించిన
నేమి ప్రయోజనము ?

సీ. ఐశ్వర్యమిచ్చిన • హరుడాది దేవతల్
భవదీయ చరణసే • వకు లటంచు
నీ యకృత్యములకు • నిత్యంబు భయమందు
దాపసేంద్రులు పాలి • కాపులంచు
సాధ్వీశిరోమణుల్ • సంయమీంద్రుల పడం
తులు వెలసతులతోఁ • దుల్యులంచు
భారతీనాధకృ • పాలబ్ధ విక్రమ,
శౌర్యబలములు శా • శ్వత మటంచు

తే. గీ. గర్వమును బూని యట్లు లో • కములయందు
మిన్ను మన్ను నెఱుంగక • మేనుమఱచి
తిరిగినందుకు, బాపమీ • కరణి నిన్ను
గట్టి కుడిపెను తప్పునే • కర్మఫలము.

సీ. నిరతంబు దేవతల్ • నిఖిలమానవులకు
బూజార్హులను బుద్ధి • బూనలేక
యెచట ధర్మంబుండు • నచటనే జయముండు
ననెడి వాక్యంబును • నరయలేక
తాపసోత్తములను సం • తాపింపఁ జేయుట
యే నాశనం బని • యెంచలేక
సాధ్వీమణి తిర • స్కారమే వంశంబు
గడతేర్చుననుమాటఁ • గాంచలేక

తే. గీ. గర్వమునఁ జరించినందునఁ • గలుష మిట్లు
బండి కారణంబయ్యెభవ • న్మృతికిని
నిందు కేమని వగతును • నేది దిక్కు
నీవు లేనట్టి యీ బ్రదు • కేలనాకు.

సీ॥ పరసతీసంగమ । వాంఛయొక్కటి చాలు,
సత్కులంబెల్ల ధ్వం । సంబు సేయ
సంయమీశ్వరతిర । స్కార మొక్కటి చాలు,
సకలభాగ్యముల నా । శనము సేయ
సాధుజనసమితి । సంతాప మొక్కటి చాలు
కలితపుణ్యము లడం । గంటఁ జేయ
దేవదూషణ దురు । ద్రేక మొక్కటిచాలు,
నిమిషంబులోపల । నీరు సేయ

తే. గీ॥ నక్కటా యివియన్ని నీ । యందు నమరి
యుండుటం జేసి యిట్టిచే । టొందనయ్యె
వగచి నందున కేమిలా । భంబుగలుగు
కర్మఫల మిట్లు నన్నునుఁ । గట్టికుడిపె.

ప్రాణేశ్వరా! నేనింక శోకము మాని ధైర్యచిత్తనై నిన్ననుస రించి కృతార్థురాలనయ్యెదగాక! (విష్ణుమూర్తినిఁజూచి) శ్రీహరీ! నీవు నన్నిట్లు వంచించెదవని కలనైనఁ దలంచియుండలేదు. నా చిత్తవృత్తి నెఱింగి యుండియు నిట్టి యకార్యమునకేల యుద్యో గించితివి? ఇదియా నీ ధర్మరక్షణము!

చం॥ అనిశము దీనసంతతిని । నారసి, వారల కోర్కెఁ దీర్చుచున్
మనుచుటా; దుష్టదైత్యుల ర । ణంబున శౌర్యమునన్ వధించుచున్
ఘనమతి దేవతాతతినిఁ । గాచుటా; యక్కట యిట్లు సాధ్వినై
న ననుఁ గుయుక్తి మానహర । ణం బొనరింపఁగ నెంచుటో హరీ.

దీనివలన శ్రీహరి, పరాంగనాహరణమాననుఁ డని వచ్చునింద కన్న, మరియొక లాభ మేమి యందఁ దలంచితివి?

విష్ణు—నారీమణీ! నిఖిలజగజ్జేగీయమానంబగు భవదీయ సౌందర్యము నకుఁ జిక్కితి నను నంగతి నీవెఱింగి యుంటివి. అది యట్లుంచుము ప్రస్తుత మీకార్యము నిఖిలామరమునిజనార్థమై నాచేఁ జేయఁ బడినది. తాపసపత్నుల బలిమిం బట్టుచు, తాపసులకు సంతాపము గలుగఁజేయుచుఁ దేవతలకుఁగూడ బాధగలిగించుచున్న నీ నాథు

డింతవఱకును నీ సాధ్వీత్వమువలన నేకీడును బొందకయున్నవాఁడు.

తే. గీ. చాన! నీ మది నొక్కింత చంచలతను
గలుగఁజేసితినేని మ | త్కృతివలన
నాలమున నీదు నాథుండు | గూలుననుచు
నిట్టిమాయఁ బన్నితి దేవ | హితముకొరకు
గినుక నొందకు నాపైన | గీరవాణి

జగద్ధితార్థమై నేనొర్చిన యీ కార్యము నింద్యముగాకయుండుఁగాక! సాధ్వీమణి వగు నీ యశమున కొవంతయుఁ గళంకముండకుండుఁగాక! నాకు నీయందుఁ బ్రీతియుండుటంజేసి నీ వఖిలలోకములచేఁ బూజింపఁబడెదవుగాక!

బృంద — మాధవా! పరాంగనల వంచించుటయేనా నీవు దేవహితము కొఱకు సేయు కార్యము! ఇదియేనా! నీధర్మసంధత! ఇదియేనా నీ భక్తరక్షణము! నాభర్తృమృతికే దుఃఖింతునా? నీవొనర్చిన యకార్యమునకే వగతునా? ఎట్టి దుష్కార్యము జేయుటకు సాహసించితివి సాధ్వియనియొక్కింతయైన దలంపవైతివికదా? దేవహితార్థమై పరాంగనల మానభంగమొనరింప దలంతువుగా! అహా! ప్రభు! నీభువనపరిపాలనదక్షత! నీకీ యాధిపత్యము లభించుట యంధ్వంబులందుండు కర్దమునకు పటీరాద్రివాసము లభించునట్లును, పాషాణముల మ్రింగు పారావతమునకు రత్నరాశి లభించినచందమునను, గ్రామతటాకాంతరంబున వర్తించు కొంగకు మానసనరోవర విహారమమరిన మాడ్కిని, ముఱుగుడు బొందులఁదినుజంబుకంబునకు మత్తసామజము తలమెదడు చేకూరినకరణిని నున్నది. (కోపముతో) సాధ్వినగు నాయెడల నట్టి యకార్యమాచరించి, మదీయాగ్రహంబునకుఁ బాత్రుండవైతివి. జాజ్వల్యమాన దావజ్వాలలఁ గ్రమముగా వారింప వచ్చును. కఠినసంజ్వర ధుర్య కాకోలగుళికలు మ్రింగవచ్చును. నానా జగజ్జాలనాశనప్రక్రియోపరల మృత్యువుతోనైనను బెనఁగి గెలువవచ్చును. యమదోఃప్రకాండదీవ్యచ్చండదండంబునైనను విఱువ

వచ్చును. కాని సాధ్వీమణుల కాగ్రహము కలిగించి సదీశు శాప
వాక్యాగ్నిజ్వాలలందు బడకుండ నెవ్వరును దప్పించుకొనజాలరు

విష్ణు—(తనలో) ఈమె నాకు శాపమిచ్చునాయేమి?

మ. విరిబోడీ! యిటు లాగ్రహింప నగునే • బృందారకుల్ వేడ:నీ
కరణింజేసితి వారికిన్ హితముగా • గన్ దీనిచే నీ మనో
హరుడీల్గెన్ విను మెందు కొక్కరికిగీ • దైవన్ లభించున్ మఱో
క్కరికిన్ మేలిది నీ వెఱుంగవొకొ లో • కంబు నీమార్గముల్.

బృంద—ముకుందా! అవ్యక్త వాక్యంబులచే నేల సమర్థింపజూచెదవు? నాకుం బతివియోగముంగూర్చి దుఃఖ మొనవించినందులకు నీవు దీనికిఁ దగినఫల మనువించక పోవుదువా? ధర్మముదప్పి చరించిన పిదప నీవు భగవంతుడనైననేమి? మఱెవ్వరైననేమి? ధర్మసంరక్షకానమై మానవతులను భంగమొనరింపఁదలచుట యా నీగుణము! సాధ్వీమణుల కాగ్రహం బొదవెనేని, వారించుట కెవ్వరుజాలుదురు నిశ్చయమైనసాధ్వి కాగ్రహం బొదవెనేనియొక్కపెట్టున సమస్త జగత్ప్రళయము సంభవించునట్లు చేయగలుగునని తలంపుము. నీవొనర్చిన యీకార్యము నాహృదయమును దహించుచు నేయుచున్నది కానిమ్ము ఇందులకుఁ బ్రతిఫలముగా నీవు పాషాణంబవై యుండుము.

విష్ణు—హా! హతోస్మి. (రాయిగా మారును.)

బృంద—(దేవతల నుద్దేశించి) ఓ యింద్రాదిదేవతలారా! రణమున మదీయనాథుని గెలువఁజాలక యిట్టికపటము పన్ని కలుషంబాజింపఁదలచి శ్రీహరిని నాకడకు బంపిన దుష్టచిత్తులగు మిమ్ము నీరుగ జేసినను నాకోపము చల్లారదు. మాధవుని నొకవేషధారిగఁ జేసి యీవంచననాటకము బ్రదర్శించ సాహసించితిరి.

[ఇంద్రుడు బ్రహ్మతో ప్రవేశించును.]

ఇంద్రు—(బృందను గాంచి) సాధ్వీమణీ! మన్నింపుము. దేవతల మొదల నెట్టిసాహసమును సేయవలదు.

బ్రహ్మ—(రహస్యముగా) మహేంద్రా! క్రోధావేశంబున నీ సాధ్వీజన త్రయము ముకుందుని పాషాణముగా జేసినది. మనము నెమ్మదిగా నీమెను బ్రసన్నురాలుగఁ జేసికొనవలయును. లేకున్న భర్తృసంతాప పీడితయగు నీమె యేమి చేసినను జేయగలదు.

ఇంద్రు—(బృందను జూచి)

సీ. వసియింపు మంచును • వక్షంబు నిచ్చిన,
  పతిపీడ యందిందు • బరగులక్ష్మి
యర్ధశరీరంబు • హరుఁడీయఁ; జూడక,
  చండియై చరియించు • శైలతనయ
మొగమునఁ దుంచికొ • మగనిని విడి ద్రో,
  పద్మసన్నిభ నుండు • చాన వాణి
నెత్తిన క్కించుకొ • నిన నాథు విడనాడి,
  పంకమున బొరలు • వనిత గంగ

తే. గీ. నీకు సాటి రారంచును • నిక్కముగను
జాటి చెప్పెద వేయేల! • సాధ్వి నీకు
దివ్యమహిమంబు గనులకుఁ • దెల్లమయ్యె
హరిని శిలగాగ గావించి • యలరినాను

బృంద—(ఇంద్రునిఁ జూచి) ఏమి నీ నక్కపనయము. అందిన జుట్టును, నందకున్న గాళ్ళను బట్టుట యను సామెత నీయందు నిజమగుచున్నది. భగవంతుండగు లక్ష్మీకళత్రునినన్ను వంచింప దురుద్యోగమున వర్తించ నీవె ప్రేరేపించి మదీయ శాపమునకు పాత్రుడగునట్లు జేసితివి. తాఁ జెడిన కోతి వనంబెల్లఁ జెఱిచె నన్నట్లు మొదటనుండియుఁ బరాంగనల వంచించు మాయోపాయదురంధరుఁడ వగు నీవిట్టి యుపదేశములనే యొరులకు గూడ జేయుచుందువు.

ఉ. మాగుని బారికోడి యభి • మానము గోల్పడి గ్రామకుక్కుటా
కారముఁ బూని కూతనిడి • గౌతమపత్నికి జారుశీలకు—

జాగుడవై దురంతమగు శాపమునంది సహస్రయోనిసం
భారము మేనిపైఁ గనిన ♦ పాపరతుండవు నీవు గావొకో.

మ. కకుబంతాధిప దివ్యరత్నమకుటా ♦ గ్రస్థాపనీ భూతభీ
తికరోద్దీపితశాసనుండవు మహా ♦ ధీరుండ వైయుండి జం
కక పాపంబున కింత యొడిగమలా ♦ కాంతుఁ నన్ జేరి వం
చనమున్ జేయుమటంచుఁ బంపితివి; దు ♦ ష్టాత్ముండ వీవారయన్.

ఇంద్రు—(తనలో) నే నేమియుఁ జెప్పక పూర్వమే యీమె నన్ను నిందించుచున్నది ఇంగితజ్ఞో నాయగాను? లేక, నన్నుగూడ శాపతప్తునిఁ జేయునో.

బ్రహ్మ—(బృందనుజూచి) సాధ్వీమణీ! ఆగ్రహింపక నా పలుకు లాలింపుము. నీకుఁ దెలియని ధర్మమొకటియును లేదు. పుండరీకాక్షుం డిట్టి కార్యమును శాపజసంతాప నివారణార్థమై చేసె నను సంగతి నీ వెఱుంగుదువు. నిరంతరమును మాధవుని చిత్తమున సేవించు నీవే యద్దేవాదిదేవుని లీలల శపింపఁ దగునా? అతఁడు లేకున్న జగముల గతి యేమగు?

బృంద—దేవా! భారతీరమణా! అన్యోన్యానురాగమున బ్రవేశించి నా భర్త మృతికి గారణమై నాకు వైధవ్య మొదవించినప్పుడు నాకీ జగములతో నేమిపనియున్నది? ఎవరు త్రివ్యక్తులైనను గోటిలో వారే పలుమరు సాధ్వీనగు నన్ను వంచింపఁదలంచి మధుసూదనుఁ డట్టి శాపము నందె. దీని కెవ్వరేమి సేయుదురు?

[లక్ష్మీదేవి—ప్రవేశము]

లక్ష్మి—(తనలో) బృందకడకు వచ్చి నాథుని, నిట్టి కార్యము సేయ వలదని యెంతజెప్పినను వినక వచ్చి తుదకు సాధ్వీమణియగు నామె శాపంబునకు బాలయ్యెను. అక్కటా! అప్పుడు నే నేమి సేయుదు? (పరికించి) బ్రహ్మేంద్రాదులు గూడ యున్నారు. ఆమెతో

సంభాషింపజాలక యున్నవిధము తోచుచున్నది. ఇఁక నే నే యామెను వేడుకొందుగాక, (బృందను సమీపించును.)

బృంద — దేవీ! పద్మాలయా! భగవంతుని యెడల నేను మహాపరాధ మొనర్చితిని. నన్ను మన్నింపవలయును.

లక్ష్మి — బృందా! నీవు సాధ్వివి. సాధ్వీలోకతిరస్కారమువలన నా నాథుఁ డట్లయ్యెను; జరిగినదానింగూర్చి తలంపక, నా యందు గరుణాంతరంగవై ప్రతిభిక్ష పెట్టుము. శ్రీహరి లేని వైకుంఠంబున నే నెట్లుందును? అది యట్లుండ సకలజగంబులును సంతాపసాగరంబున మునుంగును.

బృంద — అవశ్య

చ. వనజభవాదిదేవగణ ♦ వందితుఁ డీ హరి యాతఁ డత్పదా
ర్చనముసకంటె నెందు నిత ♦ రంబగు కృత్య మభీప్సితోపపా
దన మది లేదు నిక్కమిది ♦ తల్లి! సమస్త మెఱింగియుండియున్
వనజదళాక్షు నీగతి నొ ♦ నర్చితి చేర్చితి నీకు దుఃఖమున్.

జననీ! నామూలమున నీకుఁగాని జగములకుగాని సంతాప మొదవనేల? నాభర్త శిరముతో నగ్నిం బ్రవేశించెదగాక! అంతట నీ ప్రాణేశ్వరుండు నిజరూపము ధరించును. (బ్రహ్మేంద్రాదులను జూచి) పితామహమహేంద్రులార! నే ననలప్రవేశ మొనర్చుటకు దగిన యత్నము గావింపుఁడు.

(బ్రహ్మేంద్రాదులు - నిష్క్రమింతురు.)

బృంద — (లక్ష్మీదేవిం జూచి) జననీ! అనుజ్ఞనొసంగుము. సాధ్వీమణులకు భర్తయే దైవము కావున నేను పతిమార్గము ననుసరించుచుంటిని.

లక్ష్మి — సాధ్వీ! సాధ్వులమని గర్వించు నారీమణులను దలలెత్తకుండ జేసి, నన్నునుఁ నగజాత. భారతినిగూడ మించిన నీ పవిత్రచరి

త్రము, మహామహిమయునసమానము. అమ్మా! సాధ్వీ! పతిభక్తి కి మించిన పుణ్యముకంటెం బ్రపంచమున మరియొండులేదు. సాధ్వీ ప్రభావమునకు సాటియైనదిలేదు. తల్లీ! నీ చరిత్రము నారీమణుల కెల్లరకును నాదర్శకమగుగాక!

బృంద—(పాషాణమైయున్న విష్ణుమూర్తిం గాంచి కరములు మోడ్చి)

సీ॥ అఖిలజగన్ని ♦ యామకుండవయిన,
మాధవా! నీ దివ్య ♦ మహిమలెన్న
భారతీపతికైన ♦ వశముగా, దట్టిచో,
నజ్ఞానురాలనై ♦ ననఁగ నెంత
ప్రాఁగుఁ వేద్యుతోఁ ♦ బాత్రలుగాఁ జేసి,
జగమను రంగ స్థ ♦ లంబునందు
నాటలాడించుచు ♦ నలరు మహాశుభా
వుడవైన నిన్ను సం ♦ పూర్ణకోప,
మున నట్లు శిలగఁ గ ♦ మ్మని పల్కినంతనే;
బృంద సాధ్వీ యనెడి ♦ పేరుఁ జగతి
నిలుపంగఁగాబోలు ♦ శిలరూపు నీవిధి
గరిమఁగైకొంటివి ♦ గాకయున్న
లోకేశ్వరుఁడవైన ♦ నీకు నే శాపంబు?
నోనఁగు టేమి - యది నీ ♦ పోఁడుము టేమి

తే॥ గీ॥ ఏ ననలమున డొచ్చెద ! నీవు తొంట
దివ్యరూపంబు ధరియించి ! తేజరిలుచు
నఖిలజగముల నేలుచు ! నలరు మింక
సాధుజనరక్ష! శ్రీవత్స ! జలరుహాక్ష!

(నిష్క్రమించును)

లక్ష్మి—అహా! ఈమెచరిత్రముసర్వజగద్విసుతికపాత్రమైనది. (ఎదుటఁ జూచి) అదిగో! బృందనాథునిశిరం బగ్నిం బడవైచి తానుగూడ నందు బ్రవేశించినది.

శిల - విష్ణురూపముగా మారును.)

విష్ణు—బృందా! బృందా!

లక్ష్మి—ప్రాణేశ్వరా! ఏమిది?

విష్ణు—బృంద యెక్కడ? బృంద యెక్కడ?

లక్ష్మి—అదిగో! శ్మశానమునకరిగించిన నాథునితో నగ్నిం బ్రవేశించినది

విష్ణు—(ఎదుటం జూచి) హా! బృందా! బృందా!

(నిష్క్రమించును)

లక్ష్మి—అకటా! బృందపై నీ మహానుభావునకు పరితాపమేమి!
నేనరిగి, నెమ్మదిగా నాథుని వైకుంఠమునకు దోడ్కొనిపోయెదగాక

(నిష్క్రమించును)

ఇది పంచమాంకము.



తే. గీ పూర్వుణోష! శరటాల • పూర్ణశశిని
వంకలందెట్టి నీముఖ • పద్మమట్లు
నకట యగ్నిలో వ్రేల్చుట • కాత్మయొల్లు
నమ్మతించెనుతోచదు • సారసాక్షి.

చ. లలితమృణాలపల్లవ విలాసము మించెడు బాహువల్లి యు
జ్జ్వల దనలంబులో నిడఁగ • స్వాంతము సమ్మతిబూనె నెట్లు హా
జలజముఖీమణీ! భువన • జాలము లన్నియు వేసిగఁగుట్టిలో
వల నిడుకొన్న నాకె బలు • వంత ఘటిల్లెఁ బ్రగాఢ నెంతయు౯.

తే. గీ. నేల నొక్కింత నడచిన • నెలత! యరుణ
కాంతివహియించు భవదీయ • చరణకమల
యుగ్మ మగ్నిలోఁ గాలుచు • నుండఁ జూచి
యోర్చియుంటిని దుఃఖంబుఁ • జేర్చి మదిని.

సాధ్వివైన నీయశశ్చంద్రికలు చతుర్దశభువనములయందును గాయ
జేసికొంటివి నాచిత్తమునమాత్రము సంతాపము నాటితివి.

(బ్రహ్మయు-నిందుఁడు-ప్రవేశింతురు.)

ఇంద్రు—(బ్రహ్మను జూచి) దేవా! భారతీరమణా! శ్రీహరి స్థితి
యేరీతిని నున్నదో చూచితివా?

బ్రహ్మ— ఈమహాత్మునిదర్శించి సంభాషింతముగాక (విష్ణుమూర్తి
సమీపించి)

సీ॥ అలవికుంఠనగరి • నలరు చుండెడు నీవు
ప్రేతభూమిని విహ • రించు టేమి
సనకాదుల్ భజియింప • సంతసించెడు నీవు
భూత భజనచేతఁ • బొలుచు టేమి
ఫణిరాజశయ్యపైఁ • బవ్వళించెడు నీవు
వల్లకాటిని నిట్లు • బండు టేమి

భక్తుల దుఃఖంబు ♦ బాపుచుండెడు నీవు
భూరి దుఃఖాబ్ధిలో ♦ మునుఁగు టేమి

తే॥ గీ॥ జలజవాసిని రాణివై ♦ యలరుచుండ
బృందకై పరితాపంబు ♦ బొందు టేమి
రమ్ము వేగ వైకుంఠపు ♦ రమ్ము జేర
కమలనయనేత్రి! నన్ను ను ♦ గన్నతండ్రి.

ఇంద్రి—

సీ॥ జలజాలయాదేవి ♦ సతి. పద్మజుఁడు పట్టి
భారతికోడ; లీ ♦ శ్వరుఁడు హితుడు
ఫణభోజనుఁడు తేజి ♦ ఫణిరాజు తల్పంబు
వందిజనములు తా ♦ పసగణంబు
కామోహ్కీనంద ♦ కసుదర్శనంబులా,
యుధములు ఘనశంఖు ♦ మొత్తుబూర
యమర సంతతిసేవ ♦ కావళి; యుక్తులు
సోమభాస్కరులు; కౌ ♦ స్తుభము భూష

తే॥ గీ॥ ణం; బజాండంబు మేను; సం ♦ క్రంటు గృహము
భక్తచిత్తంబులు విహార ♦ వనము; లిట్లు
వెలఁగుచుండిన నీవొక్క ♦ కలికికొఱకు
దాపమందుట మిగుల చో ♦ ద్యంబు గాదె.

దేవా! నీకై రమాదేవి మిగుల బెంగఁగొని నీవు లేకుంటచే వైకుంఠంబుఁ బ్రవేశింపకయున్నది. సత్వరముగా విచ్చేసి మాకందఱకును ముదంబుఁ గొల్పుము.

బ్రహ్మ—తండ్రీ! బృందకై యింతఁ బరితాపము విడువుము నీ పరితాపమును బాపుటకు మేము సతీసేవివలన నొక బీజమును గ్రహించి యీప్రదేశమున నాటితిమి. అయ్యది బృందప్రతిరూపమై తులసియనఁ బఱగె. దానిం జూడుము,

విష్ణు—బృందప్రణయరూపమా! ఏది! ఏది!

(తెరలేచును)

[తులసిభూజముందుకు]

బ్రహ్మ—దేవా! వీక్షింపుము.

విష్ణు—(సంతోషముతో) ఆహా! ఏమి! (బృంద నుద్దేశించి) హా! బృందా!

తే॥ గీ॥ వడఁతి! నాదు సంతాపంబు ♦ శాప నిట్టి
మాడ్కి సతి కృపన్ దులసిగా ♦ మారినావు
భళిర! నాకును బ్రియమైన ♦ వస్తువగుట
నీవు మునిజనామరులచే ♦ నిఖిల జగము
లందు పూజలఁ గాంతు వా ♦ నంద మెసఁగ.

సీ॥ దినకరోదయమును ♦ గనినంతనే కదా,
రాణించు పద్మాక ♦ రంబుపగిది
సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రరాకను గాంచి,
రంజిల్లు రత్నాక ♦ రంబు మాడ్కి
వాసంతలక్ష్మివి ♦ లాసోదయంబున
వికసించు నుద్యాన ♦ వీథిభాతి
వార్ధరు రాకకు ♦ పరమ సంతోషంబు;
నొందుచు నుండు మ ♦ యూరమట్లు

తే॥ గీ॥ నీ మహోదయంబున నాకు ♦ నిక్కముగను
బరమహర్షంబు గలిగెఁ దా ♦ పంబు వాసె
నఖిల జగంబులఁ బూజల ♦ నందుచుండి
తులసి యనుపేర నొప్పుచుఁ ♦ జెలఁగుమింక.

బ్రహ్మేంద్రులారా! ఈతులసీమహోదయమున నేను స్వస్థ చిత్తుండ నైతిని. ఇంక నేను వైకుంఠమును ప్రవేశించెదను కాని

మీరుమాత్ర మొక కార్యము సేయవలయును. ఈతులసినిబృందా వనమునఁ బ్రతిష్టింపుడు.

ఇంద్రు—ఆజ్ఞ నెరవేర్చెదము.

బ్రహ్మ—మహేంద్రా! భగవంతుడగు శ్రీహరి స్వస్థచిత్తుడయినాడు ఇంక మనకు గావలసిన దేమున్నది.

ఇంద్రు—

సీ॥ జలజాక్షియా బృంద ♦ సాధ్వీత్వ మతివల,
కాదర్శకంబౌచు ♦ నలరుగాక
హరికిఁ బ్రీతియగుచు ♦ నలరు తులసి సమ.
స్త గృహంబులందునఁ ♦ దనరుగాక
శ్రీనాథు ప్రీతికై ♦ చిరభక్తి తులసిని
జేరి యుందఱును బూ ♦ జింత్రుగాక
తులసి నర్చించి, ని ♦ స్తుల సౌఖ్యభోగసం
పదలు మానవులు గాం ♦ చెదరుగాక

తే॥ గీ॥ తులసి యుండు ప్రదేశమం ♦ దు హరిగూడ
యుండి భక్తజనుల బ్రోచు ♦ చుండుగాక
పరమ పావనంబుగ నెంచ ♦ బడెడు తులసి
దళము ప్రతివారు శిరముల ♦ దాల్త్రుగాక

బ్రహ్మ—తథాస్తు (తెరవాలును

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.



